# జాతీయ విప్లవ జ్యోతి

(వీర సావర్కర్ - గేయ కథ)



ఐతా చంద్రయ్య




ప్రచురణ
జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్ధిపేట-502103

ఇది జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్దిపేట శాఖ మూడవ ప్రకాశనము.

ప్రథమ ముద్రణ
ఆగస్టు 1987

మూల్యము : పన్నెండు రూపాయలు

ముఖపత్రము:- శ్రీ సూరి (జాగృతి)

ప్రతులకు:-
1. రచయిత
4-4-11, షేర్‌పురా
సిద్దిపేట - 502 103 (ఆం. ప్ర.)

2. సాహిత్య నికేతన్
బరకత్‌పురా - హైద్రాబాద్-500027

3. సాహిత్య నికేతన్
ఏలూర్ రోడు - విజయవాడ.

-: ముద్రణ :-
ఫోన్ : 403.
తిరుమల ప్రింటర్స్, సిద్దిపేట.

-: ముఖ పత్ర ముద్రణ :-
భారత ముద్రణాలయం, భాగ్యనగర్.

# శుభారంభం

"బంగారు బోను కన్నా స్వేచ్ఛారణ్యం మేలైనది"..."ధర్మారాధనలో మొదటి చర్య స్వతంత్ర రాజ్యంలో స్వతంత్రుడుగా ఉండడం."... "స్వధర్మము లేని స్వరాజ్యము ఏహ్యము"... "గతాన్ని గురించి స్మృతిలేని జాతికి భవిష్యత్తులేదు"..." జాతి తన చరిత్రకు యజమాని కావాలిగాని బానిస కారాదు."

ఈ మాటలన్నీ స్వాతంత్ర్య వీరసావర్కర్ స్వరాజ్య సంగ్రామ చరిత్రలోనివి. ఆయన స్వధర్మ స్వరాజ్యాలే తన మహదాకాంక్షలనీ జీవితాంతం చెప్తూ వచ్చారు. తన జీవితంలోని ప్రతిక్షణం ఇందుకొరకే వెచ్చించారు. హిందూత్వ జాగరణకు అభ్యుదయానికి తన జీవితాన్ని అంకితం చేశారు.

ఆయన 1883 మే 28వ తేదిన మహారాష్ట్రలో జన్మించారు. స్వాతంత్ర్యదేవీ సతతారాధకునిగా సుదీర్ఘకాలం జీవించి, 1966 ఫిబ్రవరి 26వ తేదీన పరమపదించారు. ఆయన స్వాతంత్ర్య వీరుడు, మహావీరుడు, ఆయన కార్యం స్వతంత్ర మహారాష్ట్ర నిర్మాణం. మహారాష్ట్రమంటే సమగ్ర భారతమే. రానురాను ఆశబ్దం భాషాపరంగా బందీ అయిపోయింది.

నాసిక్‌లో చదువుతున్నప్పుడే చాఫేకర్ సోదరుల శౌర్యగాథలు విన్నారు. ఒకవైపు ప్లేగువ్యాధి స్వైరవిహారం చేస్తుంటే, మరోవైపు మహోత్సాహంగా బ్రిటిషురాణి విక్టోరియా స్వర్ణోత్సవాల్ని జరుపుతుండడం చాఫేకర్ సోదరులకు నచ్చలేదు ఇద్దరు ఆంగ్లాధికారుల్ని తుపాకులతో కాల్చేశారు. బ్రిటిషువారు చాఫేకర్ సోదరుల్ని పట్టుకొని ఉరిదీశారు. ఈసంఘటనతో కదలిపోయిన పాఠశాల విద్యార్థి సావర్కర్ స్ఫూర్తి ప్రదమైన కావ్యం రాశారు. ఆకావ్యం చివరలో

"ఆరంభించిన కార్యం
ఆగిపోదు; ఆగిపోదు,
అనుమానం వలదింకా!

ఈ కార్యం నడుపుటకై
ముమ్ముందుకు నడుపుటకై
మేమున్నాం - మేమున్నాం
నిశ్చింతగా ఉండండీ! ॥"

అంటూ రాసి కావ్యకర్తగా మిగిలి పోలేదు సావర్కర్, ఆయన క్రియాశీల కార్యకర్త అయ్యాడు. ఎన్నికార్యక్రమాల్లో నిమగ్నుడై ఉన్నా ఆయన గ్రంథాలద్వారా ప్రసంగాల ద్వారా ప్రబోధం మానలేదు."ఓమ్మృతవీరులారా, లఘు నవభారత్, మజినీ జీవిత చరిత్ర, సిక్కు చరిత్ర, గురుగోవింద్ బలిదానం, క్రీస్తు బలిదానం, పానిపట్టు, కమలా' గోమంతక్' మహాసాగర్, భారతస్వాతంత్ర్య పోరాటం, నా జీవనయాత్ర, అండమాన్ నుంచి ప్రతిధ్వని భారతేతిహాసంలో ఆరు ఉజ్వల పరిణామాలు, హిందూపద్ పాద్‌షాహీ, హిందుత్వం, హిందూ రాష్ట్ర దర్శనం, మోస్‌లా (నవల), లండన్‌లో తుపాకి గుండు. హిందుత్వం పంచ ప్రాణాలు, కాలాపాని, ఉశ్శ్వాసము, క్రాంతి నక్షత్రం, చరిత్రాత్మక ప్రకటనలు, తుఫాను ప్రచారం."

ఇలా ఎన్నో గ్రంథాలు రాసి, వ్యక్తి చైతన్యానికి జాతి చైతన్యానికి ఆయన దోహదం చేశారు. ఇంగ్లండులో ఉండి జాతీయ విప్లవ కార్యక్రమాల్లో పాల్గొంటున్నప్పుడు, వదిన గారి నుండి ఉత్తరం వచ్చింది. అన్నకు అజన్మ కారాగార వాస శిక్ష పడిందని ఆ ఉత్తరం సారాంశం. ఆతల్లికి ధైర్యం ఇవ్వాలి, ఆతల్లిలాంటి తల్లులకు ధైర్యం ఇవ్వాలి. రాసి పంపింది పద్యాలే. శ్లోక రూపశోకం అనడానికి మనస్సు ఒప్పుకోడం లేదు, అది ఒక సంయమి చేసిన మహాప్రబోధంగా ఉంది. ఆ సాంత్వన పత్రంలోని కొంత భాగం సారాంశ రూపంలో ఉదాహరిస్తా.

"అనేక రకాల పూలు పూస్తాయి. ఇక్కడ-అక్కడ జీవించి ఎక్కడో పడి వాడి పోతాయి. కాని వాటి మహిమగాని లెక్కగాని యెవరైనా తమ దగ్గర ఉంచారా! కాని గజేంద్రుడు తన తొండంతో పైకి లేపి శ్రీహరి చరణాలపై సమర్పించిన కమలాల జీవనం సార్థక మవుతుంది; పరమ పావన మవుతుంది. ఇదియెంత అభిమాన విషయం, మన వంశంలోని అందరూ ఆ సార్థకతను పొందడానికి సంసిద్ధంగా ఉన్నారు."

భారత దేశంలో చదువుకునేప్పుడే విద్యార్థుల్లో ప్రజల్లో స్వాతంత్ర్య పిపాస రగుల్కొల్పడానికి మిత్రమండలి, అభినవ భారత్ సంస్థల్ని స్థాపించాడు సావర్కర్. ఇంగ్లండులో మాజినీ జీవిత చరిత్ర రాశాడు. ఎలాంటి యువకున్నయినా ఈ గ్రంథం స్వాతంత్ర్య వీరునిగా తయారు చేస్తుంది అని తిలక్ "కితాబు" పొందిన ఈ గ్రంథాన్ని ఆంగ్ల ప్రభుత్వం జప్తు చేసింది.

దేశంలో విపత్కర పరిస్థితులు. అనంత కన్హారే నాసిక్ జిల్లా కలక్టర్ జాక్సన్‌ను పిస్టల్తో కాల్చి చంపాడు లండన్లో కర్జన్‌వాయలీని మదన్ లాల్ డింగ్రా చంపాడు. ఆ నమయంలో డింగ్రా గర్జన ఇలా ఉంది "భారత యువకులకు ఆజన్మ కఠిన కారాగార శిక్ష విధించడం, ఉరితీయడం మొదలైన క్రూర కృత్యాలకు నిరసన తెలపడానికిగాను, మేము కూడా ఇంగ్లీషు వారి రక్తాన్ని ప్రవహింప జేయాలని నిశ్చయించుకున్నాం." ఈ మాటలు సావర్కర్ సంసిద్ధంచేశాడని ఆంగ్ల ప్రభుత్వం నమ్మింది, సావర్కర్‌కు వ్యతిరేకంగా అభియోగం సంసిద్ధంచేసింది. లండన్‌లోని విక్టోరియా స్టేషన్‌లో బంధించింది. మోరియా ఓడలో భారత్‌కు పంపింది. ఫ్రాంసు భూభాగంలోని మార్సెలే రేవులో సావర్కర్ తప్పించుకున్నాడు. కాని విధి వక్రించి పట్టుబడ్డాడు. ప్రపంచంలో నభూతో నభవిష్యతి అనే విధంగా సావర్కరుకు "రెండు ఆజన్మకారాగారవాస శిక్షల్ని" విధించింది ఆంగ్ల ప్రభుత్వం(1910) అండమాన్‌కు పంపి "కాలాపానీ" కష్టాలకు గురిచేసింది. జైల్లోకూడా సంస్కారాలు ప్రారంభించాడు సావర్కర్ అన్నకూడా అదే జైల్లో ఉన్నాడు.

సావర్కర్‌కు కలిగిన అనారోగ్యం వల్ల, ప్రజల ఒత్తిడి వల్ల ఆంగ్ల ప్రభుత్వం ఆయన్ను అండమాన్ నుండి తెచ్చింది. దేశంలోని వివిధ కారాగారాల్లో ఉంచింది. చివరకు 1924లో విడుదల చేసింది. 1937 వరకు రత్నగిరి నుండి కదలకుండా నిర్బంధాలు విధించింది అయినా సావర్కర్ ఊరుకో లేదు. పతిత పావన మందిరాలు స్థాపించి అస్పృశ్యతా నిర్మూలనకు కృషి చేశారు. అన్యమతాల్లోకి వెళ్ళిపోయిన హిందూ బంధువుల్ని "శుద్ధి" కార్యక్రమం ద్వారా మళ్లీ స్వధర్మంలోకి వచ్చేట్టు చేశారు. హిందూ మహా సభను స్థాపించారు. స్వాతంత్ర్యానంతరం కూడా ఆయన దేశమంతా పర్యటించారు. నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న ఆర్య

సమాజిస్టు వీరయశ్వంతరావు జోషిని వెన్నుతట్టింది సావర్కరే. దేశంలోని ఏ ప్రాంతలోనైనా హిందువుకన్యాయం జరిగిందంటే స్పందించి ముందుకురికి నివారణోపాయాల్ని ఉపదేశించారు. 1910లో రెండు ఆజన్మ కారగారవాస శిక్షలు విధిస్తే చలించని సావర్కర్‌ను (1960 సంఖ్యచెప్పి) ఓ అధికారి బెదిరిస్తే అప్పటివరకు మీ ప్రభుత్వం ఉంటేకదా అన్నారు సావర్కర్. 1960 మృత్యుంజయ సంవత్సరమైనది.

ఆ మృత్యుంజయుని గురించి తెలుగు సాహిత్యంలో ఇప్పటికే ఒకటి రెండు జీవిత చరిత్రలు వచ్చాయి. ఆయన రచనల్లో కొన్ని తెలుగులోకి వచ్చాయి. భాగ్యనగర్లోని స్వాతంత్ర్య వీరసావర్కర్ సాహిత్య సమితి ఆయన గ్రంథాల్ని ప్రచురిస్తోంది.

ఇప్పుడేమో సంఘ కార్యకర్తగా పేరు పొందిన మిత్రులు ఐతా చంద్రయ్య గారు "జాతీయ విప్లవ జ్యోతి, వీరసావర్కర్ గేయ కథను" మనకందిస్తున్నారు. తెలుగు సాహిత్యంలో సావర్కర్ చరిత్రను గేయ ప్రక్రియ రూపంలో మొదటి సారిగా పలికిన కీర్తి శ్రీ ఐతా చంద్రయ్య గారికే దక్కింది. సావర్కర్ను గూర్చి ఈతరానికి తెలియాలన్న తపనతో ఇదివారు రాశారు. 12 మాత్రల్నే ప్రధానంగా ఎంచుకొని గేయ కథ నడిపించారు. కేవలం త్ర్యస్ర గతి, అక్కడక్కడ త్ర్యస్ర చతురస్రల గతి ఈ గేయాల్లో కనిపిస్తుంది. వాడుక భాషనే రచనకు స్వీకరించడం వల్ల కొన్ని ప్రయోగాల విషయంలో లాక్షణికులు ముక్కులిరిచే అవకాశముంది. అయినా ఇదొక శుభారంభం. భారత జాతీయ వీరుల జీవిత చరిత్రలు తెలుగు కావ్యేతి వృత్తాలవుతున్నాయి. చరిత్రకు మసిబూసి మారేడు కాయ చేయడానికి విదేశీ ఇజాల బానిస బుద్ధులు ప్రయత్నిస్తోన్న ప్రస్తుత సమయంలో, ఇలాంటి కావ్యాలు కోకొల్లలుగా రావాల్సిన అవసరముంది. ఇప్పటికీ వర్గ విద్వేషమే గుప్పిస్తూ జాతిని నిర్వీర్యం చేయడానికి యత్నిస్తోన్న రచయితల కళ్లు తెరిపించాల్సిన సమయం ఆసన్నమయింది.

"కన్నతల్లి బాధ దీర్ప - కదలిరాని తనయుడేల
నా జాతిని ఆదుకొనని - నేను జన్మమెత్తనేల" (పుట: 20)

అన్న సావర్కర్ మాటలు ఈనాడందరికీ శిరోధార్యం కావాలి. ఈనాటికీ కంటకాకీర్ణ పథంలో నడుస్తున్న భారతీయులకు సావర్కర్ మాటలు పూలబాటలు. ఆ బాటల్లో నడిచేప్పుడు వెలిగే జాతీయ విప్లవ జ్యోతులే ఈ గేయాలు ఈ గేయాలనందిస్తోన్న శ్రీ ఐతా చంద్రయ్యగారికీ వెల్వరిస్తోన్న సిద్దిపేట జాతీయ సాహిత్య పరిషత్తుకు అభినందనలు.

భాగ్యనగర్
తేది: 3-8-1987

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్ (ఆం. ప్ర.)



మారింది. పోకిల్లా విద్యార్థి మదన్లాలు డింగ్రా సావర్కర్ సందేశం విని.

"పుణ్యభూమి పుత్రుడనై - పిరికి బ్రతుకు బ్రతుకలేను,
దేశమాతృ స్వేచ్ఛ కొరకు- దేహత్యాగ మొనరింతును."

అంటూ కర్జన్ వైలీ దొరని కాల్చేసి చిరునవ్వుతో ఉరికంబమెక్కాడు భారత్‌లో జరిగిన హత్యాయత్నాలకు, ఇంగ్లండులోని సావర్కర్‌పై నేరం మోపి బంధించి నౌకలో భారత్ పంపారు. రాజకీయ వీరులు శత్రువులనుంచి తప్పించుకు పోయే ప్రయత్నాల కథలు చరిత్రలో చాలా ఉన్నాయి. వానిలో సావర్కర్ సాహసం అనుపమానం. ఓడ మరుగుదొడ్డి గొట్టంలోంచి సము-ద్రంలోకి జారాడు. పైనుంచి తుపాకులు కాలుస్తుంటే తప్పించుకుంటు ఈదాడు ఒడ్డెక్కిం తర్వాత విధివశాన మళ్ళీ శత్రువులకు చిక్కాడు.

"వేటగాడి బాణాలను-దాటిపోవు కురంగంగ
ఈదుకుంటు పరుగెత్తెను-బాధలేని చేపలాగ."

ఆసమయంలో సావర్కర్ మనఃస్థితి, ప్రయత్న విజయము చివరకు ఓటములను ఎంత చక్కగా ధ్వనింప జేశాడు కవి! వేగంలో కురంగం తప్పి కోవటంలో నీటిలో చేప-దొరికిపోవటంలో-ఒడ్డునపడ్డ చేప. చక్కని ఔచిత్యం పాటించాడు కవి.

అన్నదమ్ములందరూ జైలుపాలైతే అలమటించిన వదినకూ, ఒక్కగానొక్క కొడుకు చనిపోతే కుమిలిపోయి తనను కలియ వచ్చిన భార్యకూ సావర్కర్ సందేశం-సమర్థ రచనకు నిదర్శనం.

"మాతృభూమి సేవకు నా-మనసెపుడో సమర్పితం"
"దావానల మని తెలిసియు-దగ్గరైతి విప్లవాన్కి"
"రాష్ట్రకార్యమే నాకిక-రామకార్య మెల్లప్పుడు"
"చెఱసాలలు మనపాలిటి-చంద్రశాలలై నిలుచును
అంబలియే మనపాలిట-అమృత ధారయై వలచును"
"అరదండల దెబ్బలు మన-విరిదండలు కావాలిక,
కటిక నేల మనపాలిట-పూలపాన్పు కావాలిక."
"పదీపరక లార్జించుట-పొట్ట నింపుకోవడాలు

సతీపతుల విలాసాలు పరమార్థం కానేరవు.''
''దారిద్ర్యం మ్రూల్గుతుంది-దేశమాత పిలుస్తూంది,
త్యాగాలతొ జీవితాలు-తర్పణాలు విడువమంది.''

ఇవి సావర్కర్ స్పందనకు కవితా రూపాలు. కట్టు కథల గారడీలు కావు. పట్టుతేనెల మాధుర్యాలు. సావర్కర్ సాహసాలు వీరత్వపు విస్ఫులింగాలు. ఇంకా ఎన్నెన్నో వున్నాయి ఈ కావ్యంలో-వాడీ వేడీ వున్న పంక్తులెన్నో-అలాగే సావర్కర్ కవితా హృదయాన్నీ-కృషినీ సరసమంజులమైన శైలిలో అలంకారాల నగిషీలతో ఈ కవి అందించాడు పాఠకులకు.

"నా కవితల, వాగ్ధాటిన-నాదేశమె ఇతివృత్తం" పదవులకై పెదవులమై, పసిడి కొరకు పెధవలమై కవిత్వాన్ని వ్యభిచరింపజేయని మహాకవి సావర్కర్ అని సూటిగా చెప్పాడు ఈ కవి. "విప్లవ సాహిత్య సృష్టి-పరబ్రహ్మ ఇతడని" ఆంగ్లేయులు ఆరోపించారట.

"విమల హృదయ యువశక్తికి-విప్లవ పాఠాలు నేర్పి
ప్రభుత పైకి యుద్ధానికి- ప్రబోధాలు చేసినాడు."

''సావర్కర్ సాహిత్యం - చదవగానె కల్లోలం.'' "దేశీయులలో. స్వతంత్ర ప్రేరణతో కల్లోలం-ఆంగ్లేయుల్లో తమ ప్రభుత్వాన్ని ముంచెత్తే ఉప్పెన వస్తోందనే కల్లోలం"ట.

"విరబూసిన గులాబీలు-వీరవరుని కావ్యాలు" అంటాడు కవి. మన స్వతంత్ర సమరంలో గులాబి ఒక విప్లవ సంకేతం. దానిలో ఎంత మృదుత్వం వుందో అంతగా అది 1857లో విప్లవాగ్నులను రేపింది. ఒక్క పద ప్రయోగంలో ఎంతటి చరిత్రను గుర్తు చేశాడీ కవి! 1857 పై సావర్కర్ రాసిన పుస్తకం ఒక మణిపూస.

"ప్రెస్సుముఖం చూడకనే-పొంచి దూకె నిషేధాలు'' ఇది ''విశ్వ-సాహితీ చరితను-వింతగొలుపు నధ్యాయం.''

సావర్కర్ అండమాను జైలు జీవితం అతిభయంకరం. యాభయ్యేళ్ళ యావజ్జీవిత శిక్ష ఎవరికీ యింతవరకు విధించబడలేదట. జైలులో

"వెలుగులేని చీకటిలో-యెదపుటలో కవితాక్షరి."
గుండెబలం కలమాయెను-గోడలాయె కాగితాలు."
"మృతప్రాయపు గోడనిండ-అమృత ధారలెన్నొ నిండె"
"కవితా భరణాలునిండ-కరిగిపోయె రాతి గుండె"
"కడుచీకటి గదులలోన-కవితయె సిరివెన్నెలాయె."

అతని కవితలకు శ్రోతలు-జీవితాలుడిగిన ఖైదీలు. కాని వారిలో గూడ అతని కవిత స్వాతంత్ర్యపు వూహలు నింపిందట.

"మోడులైన పెదవులపై-మృదుపదముల నాట్యమాయె"
"కంపునీరు త్రాగుతునే-ఇంపగు కవితా గానము."
"దేశభక్తి సుధాలహరి-జాలువారె కవితలలో
అలంకార రసపోషణ—అలరించెను కావ్యాలలో."
నిజంగా "సాహిత్యాంబర వీధిని-సావర్కర్ ధృవతారే."

అట్టి ధృవతార కథను కావ్యంగా పాడిన శ్రీ చంద్రయ్య దేశభక్తి గేయ సాహిత్యంలో తనకొక శాశ్వతస్థానం కోసం ఉద్యమించాడు. ఫలితం భవిష్యత్తే నిర్ణయించాలి. యోగ్యతా పత్రము ఇప్పుడే ఈయవచ్చునని నాతలపు.

సావర్కర్ మహా మానవతా వాది-సంఘ సంస్కర్త-అన్నిటినీ మించి జాతీయ జీవననాడి పసిగట్టి సమాజ జీవితంలోని జాడ్యాలకు కారణాలను కనిపెట్టి వాటిని తొలగించటానికి విశ్వగురువుగా హిందుత్వం మళ్ళీ వెలుగొందేందుకు జాతీయ పథకాలు నిర్వహించడానికి బ్రతుకంతా వెచించాడు. అతని మాటలలో గతంపైన చురకలు, ఆగతానికి సుస్వాగతాలు అడుగడుగునా ఉంటాయి వానిని యథా తథంగా తన గేయాల్లో పొదగగల్గాడు మన కవి.

"కులమత ద్వేషాలవల్ల-కళ్ళిపోయె మన సంస్కృతి." అంటూనే
"యుగ యుగాలదీ సంస్కృతి-జగానికే వెలుగు దివ్వె."
"భరతమాత భూమాతకు-భారము కాలేదెన్నడు."

అంటూ "మాత" శబ్ద పునరుక్తిలో భారతీయ భావాన్ని ధ్వనింప జేసాడు కవి యిచ్చట. అలాగే "హరిజనుడనగా చెప్పెడు-హరికి ప్రియంబైన

వాడు, తరతరాల దౌష్ట్యానికి-తలవంచిన నిర్భాగ్యుడు.'' మూఢాచారులలో ద్వైవీ భావన పట్ల ఆలోచనకు, ఆచరణకు గల వ్యత్యాసాన్ని వ్యంగ్యంగా చూపెట్టాడీ కవి.

'గిరిజనులనగా నెవ్వరు-గాండీవులు ఒక్కొక్కరు.''
''మత మార్పిడి ఉచ్చులందు-కథమారిన సోదరులకు
శుద్ధి కార్యక్రమాలతో-సద్బుద్ధిని ప్రసాదించె."
''అస్పృశ్యత ఆటవికం-ఆటంకం మన ప్రగతికి ''
అంటరాని తనమన్నది-కంటకమ్ము మన జాతికి."

అని నచ్చ జెప్పి సావర్కర్ ఆనాటి అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమాన్ని అధ్యయనం చేసి మనకందించిన సందేశం.

"శ్రమశక్తిని మరువరాదు-భ్రమలచెంత జేరరాదు"

అనే వాక్యంలో విదేశీ ఇజాల మోజులు తగవు. స్వదేశీ కార్మిక ఉద్యమం కావాలని విడమరిచి చెప్పాడు. ఈ వాక్యాలు భారతీయ కార్మికులందరి నాలుకలపై నర్తించవలసిన నిజాలు కావా ?

''భారత దేశోన్నతికీ-భావిభాగ్య భారతాన్కి
భారతీయ ధర్మాలే-... బంగారు బాటయని''

జాతీయ విప్లవం మన జాతికి ఊపిరి "హిందు జాతి సంఘటనం ముందు జరిగి తీరాలి.',

స్వార్థ నీతి భంగపరచి-త్యాగనిరతి రంగరించి
మన జాతికి మేల్జేయుట-మత మౌఢ్యం కానేరదు.
యువశక్తే నవ శక్తై-ఉప్పొంగుతు కదలాలోయ్
దురాక్రమణ కీదేశం-దుర్భేధ్యం కావాలోయ్.

ఎంతటి దృష్టి సావర్కర్! ఎవ్వరిదీ సందేశం? ఇది పాటించగలిగితే పాకిస్తాన్-చైనాల సమస్యలు మనకుండేవే కావు.

ఇలా ఎన్నెన్ని ఉదహరించటం? సావర్కర్ జీవితంపై ఈ కవి మాటలు చెప్పి ముగిస్తాను

పారతంత్ర్య తిమిరాలను-చెండాడిన భానుడతడు.
అపుడైనా, ఇపుడైనా-ఇలవేలుపు యువత కెపుడు.
ఎన్ని యుగాలకు గానీ
సావర్కర్ దేశభక్తి-సహస్రాబ్ది స్ఫూర్తి మూర్తి.

అయితే ఇంకొక విషయం చెప్పకపోతే ఇది కేవలం పొగడ్త మాత్రమే అవుతుంది, ఎన్నో కవితా గుణాలున్నా-ఈ కావ్యంలో తాపీగా చూచుకుంటే కవి దిద్దు కోవలసిన లోపాలున్నవి. కథా కథనంలో కొన్ని చోట్ల అనుసంధానం (లింక్) పోయింది. ఘట్టాలు మార్చినపుడల్లా వెనుక, ముందు చూచుకోవలసి వస్తుంది పాఠకుడు. 47 వ పేజీలో సంకట కాకీర్ణ మార్గ సంబరాలు'' అన్న వాక్యం అర్థం ఏమిటి? 69 వ పేజిలో స్వేచ్ఛా వాయువులు, పురి విప్పిన పికములనడం సరికాదు. ఈ చిన్న చిన్న లోపాలు ఎన్ని అచ్చు తప్పులవో? ఈ రోజుల్లో అవి లేకుండా పుస్తకం వస్తుందా? అచ్చు తప్పులేని పుస్తకం వస్తే అది సమాజ విద్యా గంధానికి గుర్తు అన్నాడొక మిత్రుడు ఒక సారి.

ఏమైనా తొలి ప్రయత్నంలోనే ఇంత చక్కని గేయ కావ్యం సృష్టించిన ఐతా చంద్రయ్య గారికి ఆశీఃపూర్వకాభినందనములందిస్తూ ముందు ముందు మరిన్ని చక్కని కావ్యాలు వ్రాయమని కోరుచున్నాను. కాలక్షేపానికి గాక, జాతీయ వైభవమే సాహిత్య ప్రయోజనమనే సాహిత్య పరిషత్ కార్యకర్తగా ఉద్యమించి రచనా వ్యాసంగం చేస్తాడని ఆశిస్తున్నాను.

అమలాపురం
7-8-1987

డా॥ కొత్తపల్లి ఘనశ్యామల
ప్రసాదరావు M.A. P.hb.

# జాతీయ విప్లవ జ్యోతి

జాతీయ సాహిత్య పరిషత్తు ప్రచురిస్తున్న మూడవ పుస్తకము. అంధకార బంధురమై పరదాస్యంలో మగ్గుతున్న జాతికి విప్లవ జ్యోతి వెలుగులో పథ నిర్దేశం చేసిన మహనీయుని జీవిత చరిత్రను ఆమూలాగ్రంగా గేయ రూపంలో రచించారు శ్రీ ఐతా చంద్రయ్య గారు, జాతీయతా భావ ప్రేరకమైన సాహిత్య ప్రచారోద్యమము లక్ష్యముగా గల "జాతీయ సాహిత్య పరిషత్తు" పక్షాన తమ పుస్తకాన్ని ప్రచురించేందుకు అనుమతించిన శ్రీ చంద్రయ్య గారికి కృతజ్ఞతలు. జాతీయ సాహిత్య పరిషత్తు కార్యక్రమాలకు అండ దండలందిస్తున్న అనేకానేకులైన సాహిత్యాభిమానులకు, రసజ్ఞులకు శుభాభినందనలు.

ప్రభవ కృష్ణ జన్మాష్టమి.

విఠాల శ్రీకాంత శర్మ
అధ్యక్షులు
జాతీయ సాహిత్య పరిషత్, సిద్దిపేట.

# నా మనవి

భారత స్వాతంత్ర్య సమర యజ్ఞములో ఎందరో అజ్ఞాత వీరులు ఆత్మత్యాగం చేశారు. స్వదేశంలో వుంటూ కొందరు, విదేశాల్లో వుంటూ మరికొందరు పోరాటం కొనసాగించారు అక్కడా ఇక్కడా కూడా, పోరాడుతూ అష్ట కష్టాల ననుభవిస్తూ దేశమాత పాదాల చెంత పరవశించాడు వినాయక దామోదర సావర్కర్. ఆ మహనీయుని జీవిత కథను గేయ రూపంలో తెలుగు పాఠక లోకానికందించే ప్రయత్నం చేశాను. అందుకు వాడుక భాషనే ఎన్నుకున్నాను. కొన్ని చోట్ల పాదాంతములందు, దీర్ఘములను హ్రస్వములుగా వాడాను.

గేయ కావ్యం రాయడం ఇది నా మొదటి ప్రయత్నం. నా ప్రయత్నానికి స్ఫూర్తినిచ్చి ఇది "శుభారంభ" మన్నారు పూజ్యులు డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి గారు. "వీరగంధం" చిలికించి ఆశీర్వదించారు మాననీయ అష్టావధాని డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు గారు.

తగు సూచనలిచ్చి నడిపించారు మిత్రులు సర్వశ్రీ శివదేవుని ప్రభాకర్, అష్టకాల రామ్మోహన్, చెప్పల హరనాథశర్మ, విఠాల శ్రీకాంత శర్మ గారలు.

పుస్తక ప్రచురణకు హార్దికముగా, ఆర్థికముగా సహకరించారు సర్వశ్రీ రేకా అంబయ్య, శ్రీనివాసమూర్తి (జహీరాబాద్), తడకమళ్ల మురళీధర్, జి. మధుసూదన్. వేముగటి నరసింహాచార్యులు, యం. లక్ష్మయ్య, కొమరవెల్లి వెంకటేశం, సరాఫ్‌లింగయ్య గారలు. వీరేకాకుండా మరికొంత మంది మహానుభావులు గూడాను.

త్రివర్ణ ముఖ చిత్రమును అందముగా వేసి యిచ్చారు మిత్రులు శ్రీ సూరిగారు.

కవరు పేజీని భారత్ ముద్రణాలయము (భాగ్యనగర్) పుస్తకాన్ని తిరుమల ప్రింటర్స్ గారలు అందముగా అచ్చు వేసి యిచ్చారు.

పై వారలందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను.

తగు సూచనలిస్తూ తెలుగు పాఠకలోకము ఆదరిస్తుదని ఆశిస్తూ.

రచయిత.



# జాతీయ విప్లవ జ్యోతి

(వీరసావర్కర్ - గేయ కథ)

## వీరజననం - బాల్యం

శ్రీకర భారతి సేవకు
సన్నజాజి పూవులెన్నొ!
స్వేచ్ఛా బలిపీఠముపై
చివరి శ్వాస లెందరివో:

కన్నతల్లి దాస్యముక్తి
కన్న కొడుకు చేయునుగద!
వైనతేయుడవతరించి
వినతను రక్షించలేద?

పురుషోత్తమ, రాణాజీ
పుష్యమిత్ర, పీష్వాలూ
వీరశివా అరవిందులు
లాలు, బాలు, పాలులెవరు?

తాంత్యతోపె, తానాజీ
నేతాజీ, గోఖలేలు.
మాతృభూమి ముక్తికొరకు
అమరులైరి ఆరాధ్యులు

భారతాంబ పాదాలకు
పారాణులు కొందరైరి.
దేశమాత నుదుట వీర
తిలకమైరి మరికొందరు.

పేనుకు పెత్తనమీయగ
నెత్తంతా కొరిగినట్టు,
పొట్టకూటి కొచ్చినోళ్ళు
పాలకులై కూచుండిరి.

ఆంగ్లేయుల పాలనలో
అణగారిన విప్లవాలు.
విజాతీయ ముష్కరులకు
వినిపించని ఆక్రందన

భారత ప్రజ కృషిని దోచి
పల్లకి బ్రిటనెక్కిందిర!
రంగరంగ వైభోగం
హంగులనుభవించిందిర!

భరతజాతి దాస్యంలో
భంగపడిన రోజుల్లో,
జాతిముక్తి సమరంలో
ఝాన్సిరాణి నేలకొరిగె.

విదేశీయ ఆక్రమణం
స్వదేశీయ సంఘర్షణ.
భారతి సంతానానికి
భంగపాటు ప్రతిక్షణాన.

అన్నపూర్ణ అనుగుబిడ్డ
లన్నానికి తల్లడిలిరి.
రామరాజ్య భారతాన
రాకాసులు చెలరేగిరి

ఈదేశపు సంపదంత
ఇంగ్లండున భద్రమునిరి
సొమ్మొకరిది, సోకొకరిది
దొరలు ఇంటిదొంగలైరి.

విప్లవాలు తిరుగుబాట్లు
విధివంచనలై పోయెను.
భారతీయ యువతలోన
బలహీనత తలచూపెను.

బూటక వ్యాపారమంటు
భారి కమీషన్ను వేసి
మాంచెస్టరు నగరాన్ని
మహాయంత్రమయం చేసి.

పందొందవ శతాబ్దాన
పెట్టుబడులు మరచినారు.
ఆరొందల కోట్ల రొక్క
మప్పనంగ మెక్కినారు.

సభ్యత సంస్కారమంత
చప్పబడిన చెడురోజులు.
దాస్యభావ విద్యలకే
దాసోహమను రివాజులు.

జన్మించెను సావర్కర్
మే ఇరవై ఎనిమిదినా
పద్దెందొందల యెనబై
మూడవ సంవత్సరాన.

వాసుదేవ బల్వంత్ ఫడ్కె
జైల్లో బలిదానమపుడె.
మహాఋషి దయానంద
మరణించిన రోజులపుడె.

"దామోదరపంతు" తండ్రి
మాతృదేవి "రాధాబాయ్"
సంప్రదాయ పరాయణులు
సన్నకారు జమీందార్లు

అసలుపేరు వినాయకుడు
నిసలుపూరది "భాగూరు"
మహారాష్ట్ర నాసిక్‌నకు
మరిదగ్గర పల్లెటూరు.

వీరమాత పితలు రోజు
వినిపించిరి బుజ్జి కథలు.
భారత రామాయణాలు
భరతవీర పుత్రకథలు.

పూవుపుట్టి పుట్టగానె
పరిమళాలు వెదజల్లును.
పిన్నవాడు వినాయకుడు
అన్ననాన్న చదివెవెన్నొ!

వినాయకుడు అతనిపేరు.
తండ్రిపేరు దామోదరు.
ఇంటిపేరు సావర్కరు
ముడిపడ్డవి మూడుపేర్లు

పెద్దఅన్న గణేశుండు
తమ్ముడు నారాయణుండు
మైనా ఒక్కతె చెల్లెలు
మధురోహలు కోకొల్లలు

పూర్వజన్మ పుణ్యఫలము
మరుపు దరికి జేరలేదు.
మధురకవిత అల్లితానె
మధురముగా పాడిచూపె

పదియైనా నిండనపుడె
ఎదలోపలి కవితాఝురి
పదపదమని దుంకంగా
పత్రికలచ్చొత్తినవోయ్

అజంఫుర్ మత కలహాత్
అగ్గిబుగ్గి రగిలించగ
సెగపొగలై జృంభించగ
పొగిలి కారణమ్మరసె.

సంఘటనా శక్తికొరకు
స్వాభిమాన ప్రగతి కొరకు
స్నేహితవర్గాల మధ్య
సమన్వయాన్ని సాధించె

బడిచదువులు గుడిచదువులు
పది యేళ్ళకె ముగిసిపోయె
పై చదువులు నాసికులో
అన్నతాను అరిగిరటకు

హైస్కూలులో చదువుచుండ
అమ్మమరణ వార్త వచ్చె
తప్తాత్ముడు దుఃఖాత్ముడు
తల్లి భారతిగ దలచెను

తల్లిదండ్రి తానేయని
తలంచినాడు పితృమూర్తి.
గుండెలదర నీయకుండ
గడిపినాడు ప్రేమమూర్తి

కరువురక్కసికి తోడుగ
కలర ప్లేగు కల్లోలం.
ప్లేగువ్యాధి కమీషనర్
పై శాచిక దౌర్జన్యం

తిలకు తీక్ష్ణ రచనస్ఫూర్తి
తెల్పలేదు సమస్యలను.
తెల్లదొరల కోపాగ్నికి
తల్లడిల్లె తల్లిపిల్ల.

విక్టోరియ పరిపాలన
షష్టిపూర్తి ఉత్సవాలు.
వాడవాడ దాపురించె
వజ్రోత్సవ వినోదాలు

"రాండు" "స్టీను" కృత్యమ్ములు
రాకాసుల మరిపించెను.
ప్లేగురోగ మొకవైపున
ఉత్సవాలు ఒకవైపున

చాపేకర్ సహోదరులు
తుపాకులను చేపట్టిరి.
రాండు స్టీన్ల పడగొట్టిరి
దండివీరులుగ వెలిగిరి

అయినా విధి తప్పలేదు
ఆంగ్లేయులు పట్టుకొనిరి.
ఉరికంబాలెక్కించిరి
వీరవరులు మరణించిరి

గుండెలోన బడబానల
బావుటాలు ఎగసిపడెను.
ఫిరంగులే పేలిపోయె
ప్రళయాగ్నిని సృష్టించెను.

ముద్దుముఖం విప్పారిన
మంకెనపూ వర్ణమాయె.
రౌద్రవర్ణ నయనాల్లో
రక్తాశ్రుల నాట్యమాయె

అంతట పసి సావర్కర్
అర్ధరాత్రి నిదురలేచి
అమ్మవారి గుడికేగెను.
ఆదిశక్తి దరిజేరెను.

వీరమాత జిజాబాయి
వీరపుత్రి తలదాల్చెను.
భవాని జనయిత్రి ఆన
భరతమాత కొలచదలచె.

రాణా సంగ్రామసింహ
రణభేరులు మ్రోగె ఎదలో.
విజయు, వీరస్వర్గములే
వీరుల పరమావధిగా!

జననిదుర్గ పాదాలకు
జయ జయ ధ్వని మోకరిల్లి
వినయముగా. వీరముగా
వీరసంధ గావించెను

"విదేశీయ ముష్కరులను
వికృత వింత దుశ్చేష్టల
అంతమొనరిస్తానుర!
క్రాంతి లేవదీస్తానుర!!

బంధుమిత్రి సహోదరులు
వద్దని వారించిరేని!
ఐశ్వర్యము, ఆనందము
అలిగిపారిపోతె పోని!

సర్వస్వం దేశమాత
స్వేచ్ఛకొరకు వెచ్చిస్తా.
ప్రాణాలున్నంత వరకు
పరాక్రమాన్ని చోదిస్తా.

తనువులు శాశ్వతముగాదు
ధనము ఎవరి వెంటరాదు.
భరతమాత దాస్యమ్మది
తరతరాల దౌర్భాగ్యం

విజయము సాధిస్తానా
వినయముగా తిరిగివస్తి.
వీరస్వర్గమ్మచ్చిన
నీదరికే జేరుకుంటి."

ఆచదువులు సాహసాలు
అందరి హృదయము దోచెను.
ప్రసంగాల వ్యాసంగపు
పరిమళాలు వ్యాపించెను.

భారతాంబ వైభవ, ప్రా
భవముల బహు వ్యాసమ్ములు
స్థానిక పత్రికల జూచి
శ్లాఘించిరి గురువర్యులు.

గోరుచుట్టు మీద బలే
రోకటి పోటొక్కటాయె.
ప్లేగువ్యాధి వాతనపడి
పరమపదము నందెతండ్రి.

విదుషీమణి వదినె మదిని
వాత్సల్యము పొంగి పొరల
తనయునిగా లాలించెను
తల్లిలేని లోటు దీర్చె.

అన్నగారికదే వ్యాధి
ఆవహించె అంతలోనె.
వదినకు ధైర్యంజెప్పెను.
వ్యాధినయము చేయించెను.



# స్వాతంత్ర్య సమరజ్వాల

తండ్రిగారి స్నేహగణము
పాగేజీ, మహస్కరులు
సావర్కర్ చెంతజేర
"మిత్రమేళ" స్థాపించిరి.

మిత్రమేళ విస్తరించె.
క్షాత్రశక్తి ప్రజ్వలించె.
చిత్రమేమొ బలశాలురు
మిత్రమేళ మిత్రులైరి.

విదేశాలలోన ఇదే
"గదర్ పార్టి" గాపుట్టెను.
అభినవ భారత శక్తిని
అపూర్వముగ నిలబెట్టెను.

సింగపూరు, హాంకాంగున
అమెరిక ఇంగ్లాండుల్లో
బర్మ, ఫ్రాన్సు, జర్మనిలో
పెద్దసంఖ్యశాఖల్లో.

భరతమాత శృంఖలాలు
బదాబదలు జేయాలని
సుసంపూర్ణస్వాతంత్ర్యం
సాధించుటె లక్ష్యాలని.

వంచకులను శిక్షించుట
సంఘటనను నిర్మించుట
శాసనాల ఉల్లంఘన
సంస్థ సదాశయమాయెను.

నాసిక్‌లో మిత్రమేళ
నానాటికి పెంచెసేన.
ప్లేగువ్యాధి పీనుగల్ని
పలుచోట్లను కాల్చేసిరి.

సావర్కర్ వేష-భాష
స్ఫూర్తిమూర్తియై నిలిచెను.
ధోవతి,చొక్కా, టోపి
దివ్యహిందు వనిపించెను.

పందొందొందల ఒక్కటి
పరగ కష్టకాలమాయె.
విక్టోరియ దుర్మరణం
ఇంగ్లడున కల్లోలం.

"విధేయతను ప్రకటంచుట
విధ్యుయను వాదనలురేగె.
వింతవింత పోకడలను
విరోధించె సావర్కరు.

"ఎవడీరాజెక్కడోడు?
ఎలామనకు రాజాయెను?
శత్రుదేశరాజు మనకు
మిత్రుడెట్టులౌతా"డనె.

తిన్నగరాయ్‌గఢ్ జేరెను
తిలకు మహాశయు గలిసెను.
సమావేశ భవనమ్మున
భరతచరిత పాడించెను.

తిలకు సంతసించి వీర
తిలకమ్మేదిద్ది పంపె.
"భరతమాత ముద్దుబిడ్డ
భవిష్యత్తు నీదే"యనె.

సంగీతం, సాహిత్యం
జీవేశ్వర సంసేవ్యం.
స్వయంకృషిని అధ్యయనం
సావర్కరు సమన్వయం.

ప్రథమపీష్వపై వ్యాసము
వ్రాసి ప్రథముడుగ వచ్చెను.
తన వ్యాసము మెట్రికులో
తనకే పాఠ్యాంశమాయె.

పరీక్షలకన్నా ముందుగ
పరిణయమాయె యమునతో
కళ్యాణం మధుఘడియలు
కలిసొస్తే కాదందుర !

సావర్కరు దరహాసం
సతిపాలిట హరివిల్లు.
యమునాబాయ్ సిగ్గులన్ని
పతిహృదిలో పూలజల్లు.

బాబురావు బిప్లంకర్
బాధ్యతగల మామగారు.
పరిచయాలు పాతవైన
పెళ్ళితో పెనవేసుకునె.

పరీక్షలలో ప్రథముడుగా
వచ్చికూడ ఫలంలేదు.
రోజులు గడచుట కష్టం
కళాశాల చదువులెట్లు?

దరిజేర్చిన అన్న ఆస్థి
దొంగలు దోచేసినారు.
బిప్లంకర్ మామగారు
బలే! ముందుకొచ్చినారు.

పూనానగరాన్ని జేరి
ఫర్గ్యూసన్‌లో జేరెను.
కళాశాల హాస్టల్లో
కవితాకళ సాగించెను.

వ్యాసబాణమెక్కుపెట్టి
వెన్నుతట్టి లేపినాడు.
"సావర్కర్ సమితి" వెలసి
ఆర్యన్ పత్రిక నడిపెను.

కవన ధనువునెక్కుపెట్టి
కవితా బాణాలు వదిలె.
సారస్వత,శాస్త్రీయం
దేశభక్తి, ఇతిహాసం.

కాళిదాసు భవభూతుల
కఠినతులన వ్యాసాలను
షేక్స్పియర్, స్కాట్, మిల్టన్
సింగారపు వర్ణనలను.

"పేరడైజు లాస్ట్"లోని
ప్రతిపేజీ కంఠస్థం.
పావన గంగాయమునల
ప్రవాహమే సాహిత్యం.

ఆర్యన్ అంశాలు జూచి
ఆచార్యులె తలలూపిరి.
"భళా! చిరంజీవి" యంటు
భుజంతట్టి మెచ్చుకొనిరి.

లజపతిరాయొకవైపున
బిపిన్‌చంద్ర మరోవైపు.
సురేంద్రనాథ్, చంద్రపాలు
ప్రబోధాలు ప్రజ్వరిల్లె.

రాజకీయ చైతన్యం
రానురాను రాజుకొనెను.
దేశభక్తి ఉద్యమాలు
దినందినం చిగురించెను.

సావర్కరు కుటుంబాన
సభ్యుడొకడు ఉదయించెను.
పుత్రోదయ వార్తలెన్నొ
పులకింతలు కలిగించెను.

విదేశీయ వస్తువులను
వాడొద్దని ప్రచారాలు.
స్వదేశీయ వస్తువులను
సాదరముగ కొనాలనిరి.

పందొందొందల ఐదున
తేది యేడు అక్టోబరు
దసరా పండగ రోజున
నగరం నడిబొడ్డునలోన.

విదేశీయ వస్త్రాలను
వీధిలోన కాల్చేసిరి.
భాసుర జనగణం ముందు
భాషించెను సావర్కరు.

"ఆర్యబంధులారలెండి!
ధైర్యముతో కదలిరండి.
ఆర్యభరత ఖండమండి
అందమైన దేశమండి.

కన్న నేల దాస్యంలో
కడుహీనపు బ్రతుకాయెను.
తల్లిని విడిపించుటనే
తరుణము రానేవచ్చెను.

భరతజాతి ఐక్యతకే
బంగారం భవిష్యత్తు.
హిందుధర్మపాలనలో
ఈదొంగల ఎత్తుచిత్తు

ఏదీశాశ్వతము గాదు
ఈజగాన పరికించగ.
సూర్యచంద్రులుదయించిన
అస్తమించు దినచర్యగ

ఆటుపోట్ల అలికిడులకు
అలగలేదు సంద్రమెపుడు.
సుడిగాలుల కెరటాలకు
జడవలేదు భూమియెపుడు

మనదేశములోనె మనకు
మరపురాని పాట్లెందుకు?
మనయింటిన మనకిప్పుడు
మరపురాని వెతలెందుకు?

హిమాలయాన్ని చూడండి
ఎంత ఎత్తుకెదిగిందో!
భువిలో ఇక పోటీలేక
దివి వైపే కాళ్ళుజూపె.

విడ్డూరము విన్నారా
వింతొక్కటి జరిగిందట!
మంచుకొండపై మనసుతొ
మహేశ్వరుడె దిగినాడట.

దివ్యజగతి అందాలకు
దీటైందని మురిసిపోయి
హిమనగమ్ము ఒడిలోనికి
కైలాసమె పయనమాయె.

మనకోసం ఆర్యమాత
మణులెన్నో దాచిందట.
విశ్వనాక నిండిన అవి
వ్రేలాడుతు వున్నాయట.

మాతృభూమి మనకిచ్చిన
మణిమయ సంపదలనెల్ల
మాటనేర్పు తెల్లదొరలు
మాయజేసి తరలించిరి.

మనవిదేశ వస్త్రాలను
మసిజేసిన ప్రథమజ్వాల
సైతికముగ ఈజ్యోతియె
నాభారతి హృద్దీతిక.

ఎన్ని ఆపదలు వచ్చిన
ఎన్నదగిన సత్యమ్మట
బ్రిటిష్‌రాజ పాలకులకు
భవిష్యత్తు శూన్యమిచట."

ఉద్యమ స్పందన ఫలితం
ఉత్తరాలు, ప్రశంసలూ.
వసతి గృహం బహిష్కరణ
వరించింది నాయకుణ్ని.

పరీక్షలకు చదువుతూనె
పసిడిరచన సాగించెను.
తానాజీ, బాజీలను
తనివిదీర కీర్తించెను.

వీరకథలు విషకథలని
విఱ్ఱవీగి తెల్లదొరలు
నిషేధాలు బిగించేసి
ప్రచారాలు నిలిపించిరి.

మిత్రమేళ మరువలేదు
గాత్రకళను విడువలేదు.
అంతలోనె మిత్రమేళ
"అభినవభారతు"గమారె.

బియ్యే పట్టానుబట్టి
బొంబాయికి మారినాడు.
"లా"కాలేజీలో చేరి
ఉద్యమాల్ని నడిపినాడు.

"విహారు" పత్రిక కొరకై
విప్లవ రచనలురాసెను
ప్రతుల సంఖ్య పెరిగిపోయి
మతుల మార్పు సాగించెను.

ఉపన్యాస ఒరవడితో
హృదయ ఘోష వినిపించెను.
స్వాతంత్ర్యం సముపార్జన
సాధించుటె గమ్యమనెను.

శ్యాంజికృష్ణవర్మగారి
స్కాలర్‌షిప్ దరఖాస్తుతు
నాసిక్ నగరానికొచ్చి
ప్రసంగించె మిత్రులతో.

పావన గోదావరి నది
పారుతుంది ప్రాంగణాన
వాయుపుత్ర విగ్రహమ్ము
ఒడ్డునుంది గర్వించగ.

చేతిన గద ఎత్తివుంది
చేవవుంది కండరాల్లో.
కాలికింద నలిగిపోయే
కఠినాత్మునిబొమ్మవుంది.

రాక్షసరూపాలు మనకు
రంగుమార్చు అధికారులు.
హంగులేని తెల్లదొరల
భంగపరచ కదలిరండి.

యువతరంగ తరంగాలు
ఉవ్వెత్తున పొంగివస్తె,
ఊగులాడు తెల్లప్రభుత
ఊడ్చుకెళ్ళ కుంటుందా?

మారుతి మనకాదర్శము
మాయమాట నమ్మకండి
దుష్టుల శిక్షించుటకై
తరలిరండి, తరించండి."

స్కాలర్ షిప్ మంజూరితో
సంతసించె సావర్కరు.
దేశభక్త కృష్ణవర్మ
దరిజేర్చెను త్వరత్వరగ.

"భారతాంబ సుపుత్రుడిగ
భావికి వారసుడనని
పదవుల నాశించనంటు
ప్రమాణాలు చేయా"లనె.

"తెల్లవాడి సర్కారున
కొలువులేవి చేయ"నంటు
పదవులనాశించ"నంటు
ప్రతినబూనె సావర్కరు.

నయనానందముగ జరిగె
నాసికు వీడ్కోలు సభలు.
తిలకు, పరాంజపె గారలు
దీవెనలిచ్చిరి ఉభయులు.

పందొందొందల ఆరున
పరగజూను మాసమందు
తొమ్మిది సుముహూర్తమ్మున
తొలిప్రయాణ సమయమంద

సతికి వీడుకోలునిచ్చె
సుతునికి ముద్దులుజెప్పెను.
స్టీమరెక్కె బయలుదేరి
సీమచదువులకు వెడలెను.

"భరతమాత నీసేవలో
భక్తితోట తరించెదను.
నీస్వేచ్ఛను కోరనేను
నింగికై నపయునిం"తనె.



# జాతీయ విప్లవ కౌహాళం

శ్యాంజికృష్ణవర్మగారు
లండన్‌స్థిరవాసియతడు.
ఇండియన్ల వసతికొరకు
"ఇండియహౌజు" కట్టినాడు.

భారత స్వేచ్ఛా సమరం
బాధలెల్ల వివరిస్తూ
పత్రికొకటి నడుపుకుంటు
ప్రభావితము చేస్తుండెను.

మొదటి ఇండియ హౌసునందు
ముదమారగ వినిపించెను
"గ్రేయిన్"లకు ఐసనుమార్చి
గాండీవము సవరించెను

ఇండియాహౌస్ కలాపాలు
ఇంగ్లండుకు కలవరాలు.
సాగించిరి పరిశోధన
స్కాట్లండ్‌యార్డ్ పోలీసులు.

"కీర్తిబర్"ఆ యువకుణ్ణి
కలిపినారు హౌస్‌లోన.
రహస్యముగ వార్తలన్ని
రావాలని శాసించిరి.

గూఢచారి కీర్తిబర్‌ను
గుప్తముగా కనిపెట్టిరి.
రాజన్, అయ్యర్ గారలు
రిపోర్టుతో పట్టుకొనిరి.

సావర్కరు సమక్షమున
సత్యాన్నంగీకరించె.
ప్రతివార్తను పంపుముందు
పరికించుట కొవ్వుకొనిరి.

దేశభక్త కమలాలను
దండిగ పూయించుటకై
"ఫ్రీ ఇండియా సొసైటీ"ని
ప్రియమారగ స్థాపించెను.

మాటలలో ఆకర్షణ
చేతలలో ఆదర్శం
చెవులూరగ భాషణాలు
చైతన్యపు గీతాలవె.

భాయీ పరమానందుడు,
లాలా హరి దయాళుజీ,
వీరేంద్రనాథ్ చటోపా
ధ్యాయ, వి.వి. అయ్యరుజీ.

మదన్లాలు ఢీంగ్రాజీ
మాడం కామా, బాపట్.
సర్దార్సింగ్ రాణాజీ
ఎం పీ.టీ. ఆచార్యులు.

ఎందరెందరో సభ్యులు!
అందరికీ గురువాయెను
భారతీయులకు తోడుగ
విదేశాల అభిమానులు.

స్వేచ్ఛాభారత సంఘము
సమావేశమున చర్చలు.
వారానికి ఒక్కసారి
వరుస సభా పరంపరలు.

గురుగోవింద సింగుజీ
గురునానక్ శివాజీల
జయంతులలో స్ఫూర్తికలు
జయగయ జయ నాదమ్ములు.

బారిస్టర్ చదువుతోడ
బహుళము విప్లవ రచనలు.
ఇటలీ విప్లవ విపంచి
"మజినీ" చరితను రాసెను.

తిలకు పరాంజపె గార్లకు
పొత్తమంకితమ్మిచ్చెను.
తెల్లదొరల నిషేధాల
తెరల చీల్చి చెండాడెను.

ఏటేటా "మే" మాసం
భరతజాతి కవమానం
ఝాన్సిరాణి పోరాటం
ఇంగ్లండున వక్రార్థం.

ప్రభుతచూపె నాటకములు
ఝాన్సి బందిపోటుయంటు
"వీరులంత దొంగ"లంటు
విప్లవమొక నీచమంటు

పందొందొందల యేడున
పదవతేది, మే నెలన
బ్రిటన్ భారతీయులంత
బాధాతప్తత కనలిరి.

"ప్రథమ స్వేచ్ఛ సమర సమయ
సిపాయీల తిరుగుబాటు
సంస్మరణోత్సవ సభ"లను
సిటీనిండ జరిపినారు.

సమరవీర సంస్మరణిక
ప్రాంగణాన సావర్కరు
నిజమిదియని జనావళికి
నిక్కముగా వివరించెను.

"అప్పటి విప్లవకారులు
అచ్చమైన దార్శనికులు.
ఝాన్సిరాణి పోరాటం
స్వేచ్ఛాచరణ స్వీకారం.

జాతిస్వేచ్ఛ క్రాంతి సమర
యజ్ఞానికి సమిధలమై.
విజయమ్మో, లేక వీర
స్వర్గానికి చేరుతాము.

అప్పటి "మే"పది యుద్ధం
అంతం కాలేదింకా.
భారతి పూర్ణేందు ముఖం
భాసము కాలేదింకా.

అహర్నిశం విప్లవించి,
ఆత్మత్యాగ ప్రకాశముతొ
అంతమౌను పోరాటం
అసమానపు విజయాలతొ."

ఆంగ్లప్రభుత రెచ్చిపోయి
బంధనాలు విధించింది.
భారతీయ పౌరులకడు
బాధల ముంచెత్తింది.

శ్యాంజికృష్ణవర్మగార్ని
శివారులను ధాటించిరి.
పారిస్ చేరగనె అతని
పత్రికలా పేసినారు.

కృష్ణవర్మ వారసునిగ
కనిపించెను సావర్కరు.
ఇండియ హౌసున జేరెను
మేధావుల బిలిపించెను.

"భరతజాతి బాధామయ,
బ్రిటిష్‌రాజ్ కృత్యాలను
వివిధదేశ జనావళికి
వివరించుట న్యాయ"మనెను.

జర్మనీలో జరుగబోయె
"అంతర్జాతీయ సోష
లిస్టు మహాసభ"లకొరకు
ప్రతినిధులను పంపాలనె.

సర్దార్సింగ్ రాణాజీ,
మేడంకామాలిరువురు
భారతీయ దూతలైరి
"స్టట్‌గర్టు"న కాలిడిరి.

సావర్కరు సృష్టించిన
చక్కనైన పతాకాన్ని
భారతీయ కేతనమని
మేడంజీ ఎగరేసెను.

తెల్లదొరల అడ్డంకులు
చెల్లలేదు మహాసభన
మేడంజీ ముందుకురికి
మాట్లాడెను సాహసాన.

"వివిధదేశ సభ్యులార
విమలహృదయదూతలారా!
మాభారతభూముమీద
మోపగాళ్ళు జేరినారు.

భారతీయ జనావళిని
బాధించుటె పనులంట
బ్రిటిష్‌రాజు అధికారం
భారత్‌కింకెందుకంట!

అరివీరుల అభిమానం
హరియించుట తగదింకా!
సూర్యచంద్రులు లేకమైన
స్వేచ్ఛనెవరు ఆపరింక!

నిప్పులతో చెలగాటం
నవ్వులాట గాదుసుమా!
పులిపిల్లల పయ్యాటలు
పిల్లలాట గాదుసుమా!

భుగభుగ మండే మంటల
కౌగలింప సాహసమా?
కణకణమండే గుండెల
మంటలార్ప సాధ్యమ్మా?

తెల్లదొరలు మర్యాదగ
తరలిపొండి ఇంగ్లండుకు.
మారామిక చేయకండి
మెడలుబట్టి గెంటువరకు.

మృగరాజును ముద్దాడిన
మనిషిమహిని నిలిచేనా!
కరిరాజును కవ్వించిన
కరుగుకట్ట మిగిలేనా!

సావర్కరు ఇంగ్లండున
సవ్యసాచి అవతారం
అతని వాగ్వాహినిలో
అవతరించు కొత్తతరం

భారతాంబ పుణ్యమహిమ
భావితరం భాగ్యమహిమ
సావర్కరు పోరాటం
సీమదొరల చరమాంకం

అమాయకుల శిక్షించుట!
అపరాధుల రక్షించుట !!
అందరి గుండెలు మండిన
అంతమౌను బ్రిటిషు ప్రభుత

ఏదేశపు చరితసైన
ఎన్నిసార్లు పఠించినా
దేవభక్త విప్లవాన్కి
తిరుగులేదు. విజయమ్మే

పరమాత్ముడి పంచలోన
పిసరంతగ అలస్యమె !
అంధకార బంధురమిది
అనుకుంటే అమాయకమె!!

ఏరోజో, ఏక్షణమో॥
భారత్ స్వాతంత్ర్యమౌను
సావర్కరు కన్నకలలు
సాకారములై తీరును

అందువలనె చెబుతున్నా
అలస్యం చేయకండి
అన్యాయార్జిత అస్తులు
అక్కడనే వదలిపొండి,,

కరతాళ ధ్వనులతోడ
కహకహమనె సభాస్థలం
అంత భారతాంబ హృదిన
ఆశాదీపం వెలిగెను'

శాంతిమార్గ రక్షణకై
క్రాంతి కాంతి తప్పదనిరి
బాంబులు తయ్యారుచేయు
బాటలింక తప్పవనిరి.

రష్యా ఇంజనీయరుతో
రహస్యముగ చెలిమిచేసి,
బాంబుచేయ నేర్పినారు.
బాపట్ మహావీరునికి

అభినవ భారత సంఘము
అంతతొ పని ఆపలేదు.
భారత దేశానికెన్నొ
పిస్తోళ్ళను పంపించెను.

బాపట్ బృందమ్మొక్కటి
భారత్ పంపించినారు.
భారత చైతన్యరథపు
బాటను చూపించినారు.

పంథొందొండల ఎనిమిది
ఏప్రిల్ ముప్పది తేదిన
ముజఫర్పూర్ మాజిస్ట్రేట్ పై
బాంబువిసరె ఖుదిరాంబోస్.

విధివక్రించిన సమయం
విసిరిన యది గురితప్పెను.
ఇద్దరు ఇంగ్లీషుస్త్రీలు
బలిమైరా బాంబుపేలి.

ఖుదిరాంబోసుకు తోడుగ
సత్యేంద్రబోస్ ఇంకొకడు.
పట్టుబడిరి పట్టుతప్పి
కన్నయలాల్ దత్తుగూడ.

భారతాంబ స్వేచ్ఛకొరకు
బలిపీఠాలెక్కినారు.
వందేమాతర మంటూ
బృందావని తొక్కినారు.

బనాయించి మరోకేసు
బారీంద్రుని ఇరికించిరి.
హేమచంద్ర రామన్‌లను
అండమాను తరలించిరి.

"యుగాంతర్" పత్రికనడి
పించెను భూపేంద్రనాథ్.
"వందేమాతరమును" అర
విందఘోషు నడిపించెను.

ఎందరెందరో వీరులు
ఎదురుతిరిగి అరెస్టయిరి.
తిలకు మహాశయునిగూడ
తరలించిరి మాండలేకు.

విప్లవ సంఘము శాఖలు
వాడవాడ వ్యాపించెను.
సావర్కారు సహోదరులు
గణేశ్‌బాబు పట్టుబడెను.

ఇరవై పిస్తోళ్ళ సంచి
ఇండియాకు చేర్చుటకై
చతుర్భుజమీను జేరె
"దట్టె" గారికి చేర్చుటకై

దౌర్భాగ్యం వెక్కిరించి
దారిగాంచి కసిరికొట్టె.
ముట్టలేదా పిస్తోళ్ళు
మహారాష్ట్ర దట్టెగారికి.

లండన్‌పుర వీధులలో
మొండిగ ఊరేగింపులు
లజపతిరాయ్ బిపిన్‌చంద్ర
గోఖలే, కపర్దెతో.

హిందూదేశ వాసులకు
హింసలు నిర్బంధనాలు.
అభినవభారతి సభ్యులు
అన్యాయము నెదిరించిరి.

ప్రతీకార చర్యలకిక
పాటుపడక తప్పదనిరి.
మదన్లాలు డింగ్రాయను
మహితుడొకడు హుంకరించె.

అమృతసర్ వాసియతడు
అమీ-తుమీ తేల్చువాడు.
ఇంజనీరింగ్ చదువులకై
ఇంగ్లాండుకు చేరినాడు.

సావర్కరు మాటలతో
సంతసించి పోయినాడు.
దేశభక్త మయూరాన్కి
ధైర్యం పురివిప్పి ఆడె,

"పుణ్యభూమి పుత్రుడనై
పిరికి బ్రతుకు బ్రతకలేను.
దేశమాత స్వేచ్ఛకొరకు
దేహత్యాగ మొనరింతును.

దారుణాలు, మారణాలు
ఖుదిరాంబోస్ త్యాగాలు.
ప్రాణత్యాగ పాఠాలను
ప్రతివీరుడు నేర్వా''లనె.

"దేశభక్త కోయిలగా
తలర్చుటే ధ్యేయ"మనెను.
"పరాక్రమం ప్రతిఘటనలు
పెట్టని భూషణము"లనెను

పందొందొందల తొమ్మిది
జూలై ఒకటవ తేదిన.
ఇంపీర్యల్ ఇనిస్ట్యూటు
భవన ప్రాంగణము నందు.

మదన్లాలు డింగ్రాజీ
కొదమ సింగమైదూకెను.
కసిదీరగ కాల్చి కాల్చి
"కర్జన్ విల్లీ" గూల్చెను.

"కారణమే"మని అడుగగ
'కర్జన్ కర్కోటకు'డనె.
"బెంగాలును విభజించిన
బ్రహ్మరాక్షసుడు వాడనె."

గుండెలు దీసిన బంటని
గుండెలదిరి బంధించిరి.
సహజనాడి స్పందించగ
స్పందించిరి డాక్టర్లే.

పసిడిపంట పొలాల్లోన
మిసిడిపాటు మొక్కలెన్నొ !
పావన గంగానదిలో
పనికిరాని ప్రాణులెన్నొ !!

భారత మితవాదులంత
బెరుకుతోచ సభజరిపిరి,
విప్లవ పంథా ప్రగతికి
''వేయనట్టి కళ్ళెమనిరి.

ఢింగ్రాజీ చర్యలన్ని
డాంబికముగ నిరసించిరి.
సావర్కరు ప్రతిఘటనకు,
సింహగర్జనకు బెదిరిరి.

జైల్లో ఢింగ్రానుజూచి
"జైత్రయాత్ర ఆగ"దనెను.
"తపోభూమిలో వెలసిన
త్యాగధనుడ జోహా ర్లనె.

విమల సజల నయనాల్లో
వీరపరువముట్టిపడగ
దరహాసపు చూపులతో
ఢింగ్రాజీ భుజంతట్టె

''క్షాత్రవీర సింహమపై
శత్రుదేశ అధికారిని
స్థానబలిమి గలవానిని
చంపినావు జోహా'' ర్లనె.

ఆందోళన లోకవైపున.
అతని చదువు లోకవైపున.
బారిష్టర్ పరీక్షలో
బహుబాగా పాసాయెను.

పట్టాపొందాలంటే
ప్రమాణాలు చేయుమనిరి.
రాజకీయ కార్యాలకు
రానని రాసివ్వమనిరి.

భారతాంబ బాగుకోరి
బాసలేమి చేయననెను.
పట్టాలనె కాలదన్ని
పట్టుదలను విడువననెను.

భారతీయ విద్యార్థుల
బాధించిరి శోధించిరి
దమనకాండ, నిర్బంధం
దబాయింపులను పెంచిరి.

ఇండియన్‌హౌస్ మూతపడె
సావర్కర్ వసతిపోయె,
బిపిన్‌చంద్ర పాల్ ఇంటికి
బసమార్చక తప్పదాయె.

బిపిన్‌చంద్ర ఇంటిపైన
బటాచోర్ల దాడిజరిగె.
వీధినపడి సావర్కరు
వసతికొరకు వెదకసాగె.

లండన్‌నగరాన్ని చుట్టి
లాడ్జింగుల నడిగిచూచె.
ఆశ్రియ మెట దొరకకున్న
అచలమ్ముగ నుండిపోయె.

డిటెక్టివులు వెంటబడిరి
తిండికరువు కల్పించిరి.
బ్రైటన్ సంద్రపుటొడ్డున
బాధతోడ కూర్చుండెను.

కడలి తరంగములవోలె
కదలిపోయె భావసరళి.
వార్నిధి తన మిత్రుడుగా
వాగ్జాలము గుప్పించెను.

"విన్నావా కడలిరాజ !
వింతలెన్నొ జరిగినాయి.
కన్నావా కడలిరాజ !
కఠినాత్ముల ఆకతాయి.

బ్రిటిషు కపటనాటకులు
భారతాన ప్రవేశించి,
వంగి వంగి సలాంజేసి
వ్యాపారము జేతుమనిరి.

నిలువనీడ నడిగినారు
నిలువుదోపిడిని జేసిరి.
తిన్నయింటి వాసాలను
తిన్నగ లెక్కించినారు.

నక్కజిత్తు లెన్నొ జూపి
నయవంచన జేసినారు.
దయా-ధర్మమంటూనే
దేశం కబళించినారు.

పుణ్యభూమి నిధులనెల్ల
పూర్తిగ దోచేసినారు.
"పాపం! పోనీ" అంటే
పాలకులుగ మారినారు.

స్వేచ్ఛకొరకు పోరాడితె
మ్లేచ్ఛుడవని యన్నారు.
అన్యాయము నాపుమంటె
అంతంజూతు మన్నారు.

నిర్మల హృదయుడవు నీవు
న్యాయమేదొ తేల్చిచెప్పు.
నను బోంట్లను వంచించే
న్యాయమెంతవరకు ఒప్పు !

నీచల్లని ఒడిలోనికి
నన్ను జేర నీయవయ్య!
నాదేశము తీరాలకు
నన్ను జేర నీయవయ్య!

అయ్యో! ఇదియేమినాలో
అమాయకపు ఆలోచన.
తలపులు దారులుదప్పిన
తప్పని వారించవేమి?

నీకుగూడ సమ్మతమా
నీచుల దుష్కార్యమ్ములు
కొంచెము యోచించి, మరీ
కాంచవయ్య నావ్యథలను.

మరచితివో మాఅగస్త్య
మహామునిని ఒకగ్రుక్కగ
ఆపోసన చేసినీదు
అంతుచూసినట్టి ఘనుని.

మళ్ళీ కబురెట్టితినా
మాటకు దిగివచ్చునయ్య.
నీకుతగిన శాస్తిజేయు
నిజాలేమి దాచకయ్య!

ఐనా నా మాతృభూమి
అంత పిరికిదేమిగాదు.
నామది శాంతించుకొరకు
నీచేంతన గోడు, ఇంతె!

అంతరంగ తరంగాలు
ఆగమంటె ఆగేనా?
ఆపెదనని ప్రయత్నిస్తె
అంతవరకు ఆగేనా?

పసిపిల్లని నోరుమూస్తె
పాలధార లాగేనా?
భరతమాత నోరునొక్కి
బ్రతికివచ్చి తీరేనా?

కన్నతల్లి బాధదీర్చ
కదలిరాని తనయుడేల?
నాజాతిని ఆదుకొనని
నేను జన్మమెత్తనేల?"

తనకుతానె ధైర్యమాయె
తరలివచ్చె నగరానికి.
కర్తవ్యము స్ఫూర్తినిచ్చె
కార్యదీక్ష మూర్తినిల్చె.

తెల్లదొరల వంచనకళ
తెలిపిన డీంగ్రాప్రకటన
మాయ మయిందనగానే
మదినిరేగె ప్రతిఘటన.

బ్రిటిష్‌వాడి ఎత్తులన్ని
ఎత్తువేసి చిత్తుజేసె.
ఆ డీంగ్రా ప్రకటనమును
పత్రికలలో అచ్చువేసె.

అకలంకుడు డీంగ్రాజీ
ఆగష్టు పదిహేడురోజు
జైజైభారతి యంటూ
జయ నాదమ్మొనరించెను.

"హిందూదేశమున జన్మ
ఇలలో పుణ్యాత్ములకే.
మరలజన్మ మొకటివుంటె
మాతా అది నీకొరకే.

భరతజాతి భూమాతకు
భారము కాలేదెప్పుడు.
హరిహరాదు లేకమైన
ఆగబోదు సమరరథం"

మాటలలో తొణుకులేదు
మార్పులేదు వదనములో.
ఉన్నత ఆశయసిద్ధికి
ఉరికంబము కౌగలించె.

మదన్లాలు బలిదానం
మహాజనుల చర్చాంశం.
విప్లవ వీరులు నడచిన
వీధులలో భయం భయం

పద్దెందొందల యాభై
యేడున సంపన్నమైన
భారత స్వేచ్ఛా సమరం
భంగపాటురాయదలచె.

జాతీయత, దేశభక్తి
జగజగాలు మురిపించిన
భారతస్వాతంత్ర్య సమర
చరితమ్మది ప్రభవించెను.

విషయ సేకరణ కొరకై
విశ్వప్రయత్నము జేసెను.
గూఢమైన విషయాలకు
జాడజాడ బట్టిజూచె

హిందూచరిత పత్రములు
ఇండియ హౌసున భద్రం!
ప్రభుత అనుమతిస్తేనే
ప్రవేశార్హతట చిత్రం!!

మానేజరు ముఖర్జీని
ముందు అడిగి చూచినాడు.
ఆయన సతి సిపారసుతొ
ఆ పని సులభమ్మాయెను.

ఎవరెన్నడూ చెప్పనివి
ఏ పత్రికలో రానివి.
రాజకీయ పత్రములతి
రహస్యాల అగ్రిమెంట్లు,

పార్లమెంటు చర్చించిన
పలువిధ అంశములెన్నో
అంతరంగిగమ్మైనా
అసంఖ్యాక లేఖలెన్నో,

సైనిక బలగాలదారి
సవాలక్ష వ్యూహమ్ములు.
మ్యూజియమున నిండియున్న
మాజిక్కులు-లాజిక్కులు.

పద్దెందొందలయాభై
యేడున ప్రభవించినట్టి
విప్లవ విషయాల కొరకు
వివిధ గ్రంథములు తట్టెను

కత్తికి దీటైనదొకటి
కలమని చూపించదలచె.
మహాగ్రంథ రచన కొన్ని
మాసాలలో పూర్తిజేసె.

మొట్టమొదట ఉద్గ్రంథము
మరాఠీలొ పూర్తిజేసి
ప్రచురణార్థమై భారత్
పంపించెను అన్నగార్కి.

గుట్టుగ విషయాలు కొన్ని
గూఢచార్లు పసికట్టిరి.
ప్రెస్సులపై నాసిక్‌లో
దాడులెన్నొసాగించిరి.

వ్రాతప్రతిని పట్టాలని
రంగములో డిటెక్టివ్‌లు.
ఎత్తులు చిత్తులు కాగా
పొత్తము పారిస్ జేరెను.

జర్మనీలో ప్రచురణకై
జరిగె విఫల ప్రయత్నాలు.
ఆంగ్లములోనికి మార్చిరి
అభినవభారత్ సభ్యులు.

డబ్ల్యూ. వి.ఫడ్కే, గుండె
ధైర్యముగల మిత్రులంత.
అనువాదము పూర్తిజేసి
అచ్చొత్తిరి హాలెండులో.

పొత్తము అధ్యాయమొకటి
పోలీసుల చేత జిక్కె.
వ్రాతప్రతిగ నున్నప్పుడె
విధియించిరి నిషేధాన్ని.

చెంపదెబ్బ చాలదంటు
గోడదెబ్బ తోడాయెను.
కన్నకొడుకు చావు కబురు
కన్నీళ్ళకు కబురంపెను.

కదలలేదు, మెదలలేదు.
కఠిన విధిని తిట్టలేదు.
వీరత్వం తరగలేదు.
భీరత్వం తాకలేదు.



# మృత్యు పత్రము

అహ్మదాబాదున గూడా
అవతరించె విప్లవాగ్ని.
వైస్రాయ్ లార్డ్ మింటోను
వెంబడించి వంచించిరి

వందేమాతర గీతము
వాడ వాడ నినదించెను.
జాతియువత కేతనమై
ఝుంఝూనిలముగ మారెను

గణేశ్‌బాబు సావర్కరు,
గద్దింపుల నిరసిస్తూ
"చెప్పు చూద్దాం" శీర్షికన
చెంపపెట్టు కవితరాసె.

రాజుతలచుకున్న చోట
దెబ్బలకేం కొదవంటా!
రాబందుల పాలనలో
రక్షణయే ముందంటా!!

తెల్లదొరలు రెచ్చిపోయి
తక్షణమే వలపన్నిరి.
కారాగారమున కంపి
కసిదీరగ శిక్షించిరి

ఇంగ్లండున సావర్కరు
ఇక్కడ సోదరులందరు.
చిన్నవాడు నారాయణ
రావుగూడ మిన్నవాడు

నాసిక్ జిలా కలెక్టరు
నరపిశాచం జాక్సన్న
యువ "అనంత కన్హారి"
యమరాజై కాల్చిచంపె

బొంబాయిలో గవర్నరు
బధిర విచారణ జరిపెను.
జాక్సన్ హత్యకు హేతువు
అభినవ భారత్ పనులనె

అభినవ భారత్ తెరపై
సావర్కరు నాయకమణి.
ఇంగ్లండులో కూచున్నా
ఇండియాలో చలామణి

బూటక సాక్ష్యాలు జూపి
భరతపుత్ర నిందితుడనె.
ఇంగ్లండున అరెస్టునకు
ఇచ్చట వారంటు రాసె

ఇంతలోన సావర్కరు
ఇంగ్లడును దాటిపోయె.
పారిస్ నగరము నుండగ
పిడుగుపాటు వార్తలందె

"విషమించిన కాలమ్మిది
విప్లవాలు ఆగొద్దనె.
"తప్పించుక తిరుగుట నా
తరము కాదు, తగదు" అనెను

పారిస్ నగరాన్ని విడిచి
తిరిగి ప్రయాణమ్మాయెను.
లండన్ కెళ్ళే రైల్లో
"మిస్ పెరీన్"తొ కూచుండెను.

పందొందొందల పదిలో
పదమూడో మార్చినాడు
విక్టోరియా స్టేషనులో
విధికిలొంగె మహనీయుడు

నిందితుడని తెల్ల ప్రభుత
నొక్కి నొక్కి వాదించెను
భారతజన నీరజములు
బదనికలై నిరసించెను

సావర్కర్ పట్టుబడుట
సాహస కార్యమే, కాని
భారత స్వాతంత్ర్య భవిత
బహుదూరమ్మై నిలిచెను.

యువకవి చేతుల మురిసెను
యవనుల కటుబంధనాలు.
బ్రిక్స్టన్ జైల్లో మరిగెను
భరతవీర ఆశయాలు

దేశద్రోహ నేరమనే
దగుల్బాజి వలలోపల,
నారాయణ సావర్కరు
నలిగిపోయె అంతలోనె

గణేశుణ్ని తెల్లదొరలు
దేశాన్నే దాటించిరి.
విహ్వల హృదయాంతరంగ
వదినగారు లేఖరాసె.

"ముగ్గురు మగదిక్కుమాకు
మురిసినారు జైల్లోనే:
గుండె కరిగి నీరైనా
అండ యెవరు మాకిప్పుడు?

ముగ్గురన్నదమ్ములు మా
ముందులేని విషకాలం.
వంశవృద్ధి దశలో, ని
ర్వంశమాయె మన వంశం

బాగోగులు చూచుటకై
బంధువు లెవ్వరు మాకిట?
ఏ జన్మది పాప ఫలమొ
ఇపుడు దాపురించిందట"

ధైర్య రసం రంగరించి
ధీరుడు ప్రతిలేఖ రాసె.
మరుపురాని బంధాలతో
"మృత్యు పత్ర" మొకటి రాసె

"వదినా ! కారణ కారిణి
నీవమ్మా స్ఫూర్తిదాయిని!
వినిపిస్తివి మాకెందుకు
వీర కథలు బాల్యములో?

మాతృ భూమి సేవకు నా
మనసెపుడో సమర్పితం,
నాకవితన, వాగ్ధాటిలో
నా దేశమె ఇతి వృత్తం

ఫలితమేమొ తెలిసిగూడ
పాటించితి నీ వ్రతాన్ని,
దావానలమని తెలిసియు
దగ్గరైతి విప్లవాన్ని

స్వేచ్ఛ సమర యజ్ఞమ్మున
దహించాను భోగములను.
మిత్రసంఘ సభ్యులే, ప
విత్రయజ్ఞ సమిధలైరి.

యజ్ఞజ్వాల కీలలలో
త్యంజించాను సర్వస్వం.
యజ్ఞహవిస్సుగ పుత్రుడు,
యమున, నీవు సమర్పితం.

దేశమాత సంతానం
దూకును ముప్పైకోట్లు
నా తమ్ముడు, అన్నగూడ
నడిచి ముందుకొచ్చినట్లు.

దైవకృపను చూరగొన్న
దేశభక్త వంశమ్మిది.
దినదిన ప్రవర్ధమాన
దిశలో పయనించునది.

ఒక్కయింటి పొయ్యిలోన
పొగలు యారిపోతె నేమి?
పలువురి యింట్లో పొయ్యిల,
పొగసెగలై రగులునమ్మ.

రంగుల బృందావనాన
రంగులీను పూలెన్నో!
దైవపాద పూజకేగి
దైవత్వం పొందునెన్ని?

విశ్వంభర వినిలయాన!
వింతగొలుపు జీవులెన్నో!
మహితమైన పుణ్యఫలం
మానవ జన్మమే మిన్న!

ముగ్గురమే గాని మేము
ఏడుగురము మైననేమి?
వీరులుగా జీవించుటె
విమల కార్య మనువారం.

ఏ జన్మల పుణ్యఫలమొ
ఏనుగు తొండమునెక్కి,
దేశమాత పూజకేగు
జీవన పుష్పాలు కొన్ని!

రాష్ట్ర కార్యమే నాకిక
రామ కార్య మెల్లప్పుడు.
నీతి బద్ధ మౌగావున
నిదానించు నీవిప్పుడు

భగవంతుడె మన అందరి
బాగోగులు జూచువాడు.
వీరపత్ని వమ్మ వదిన!
వీడకమ్మ ధీరగుణం"

నాడైనా, నేడైనా
మృత్యుపత్ర మిదియగునా?
సందేహాత్మల యెదలో
అమృత పత్రమే యౌనా!

సర్ రూపస్ న్యాయవాది
సావర్కరు నెదురించెను.
వందేమాతర గీతము
విప్లవాల మూలమనెను

పలికె తెల్ల న్యాయమూర్తి
పాట నిషేధం కాదని
"భారత స్వాతంత్ర్య" గేయ
భావన నేరము కాదని.

పాట స్ఫూర్తి విప్లవ ప్రా
భవమెయగ్ని కణాలనిరి.
బ్రిటిష్ పాలకులు యతణ్ని
భారత్ పంపించుమనిరి.

గత నాలుగు వత్సరాల
గభీర వాక్భాషణాలు,
విషబీజములై తోచెను.
రాజద్రోహ మనిపించెను.

భారత దేశంలోనే
భావి విచారణ యనగా
ఐ వీ. యస్. అయ్యర్జీ
అతని కలిసె నాత్రముగా.

ఒకరి కళ్ళు ఇంకొకరికి
హృదయ దీప్తు లనిపించెను.
బరువెక్కిన గుండెలతో
భవిష్యత్తు నూహించెను.

వీరవరుని హస్తాలకు
వేసిన సంకెళ్ళు గాంచి
అశ్రుధార లాగలేక
విస్తృతమై ప్రవహించెను.

ఎన్నో మాట్లాడాలని
ఎగిరొచ్చిన అయ్యర్జీ
మిత్రుని అవతారము గని
మిన్నకుండె దైన్యమ్మున

సావర్కరు గుండెదిటవు
సాంత్వన వచనాలు బలికె
"స్వేచ్ఛాపోరాట యజ్ఞ
సమిధలకివి తప్పవిపుడు.

చెరసాలలె మనపాలిటి
చంద్రశాలలై నిలుచును.
అంబలియే మనపాలిటి
అమృతధారయై వలచును.

అరదండల దెబ్బలు మన
విరిదండలు కావాలిక,
కటికనేల మనపాలిటి
పూలపాన్పు కావాలిక.

నెనరులేని ప్రభుత ముందు
నయనాల్లో నీరెందుకు?''
గీతలోని శ్లోకమొకటి"
గొంతుయెత్తి వినిపించెను.

మార్సలీసు దీవిలోన
మర్మముగా కలవాలని
అయ్యర్ యూహించినాడు
అంతరార్థ భావాలను.

పందొమ్మిది వందలపది
జూలై ఒకటవ తేదిని
మరియా స్టీమరు మోయగ
పయనము కొనసాగినాది.

జూలై యేడవ తేదీన
జలప్రయాణ మొనరిస్తూ
మరమ్మతుల పనులకొరకు
మార్సెల్సున్న స్టీమరాగె.

ముందె ఫ్రెంచి సర్కారుతొ
మొరపెట్టిరి తెల్లదొరలు.
"ఓడలొ వచ్చే ఖైదిని
ఒంటరిగా వదలొద్దని''

ఉన్నతాధి కారులచట
ఉండిరి పదిమంది వరకు.
కంటికి రెప్పగ కాచిరి
చంటి పాపవలె జూచిరి.

మాటలోన, ముఖములోన
మార్పులేవి గాంచరైరి,
నిబ్బరాన్ని, నిశ్చింతకు
నివాళులే యర్పించిరి



# కడలి కౌగిట్లో

తప్పించుకు పోవారని
తడియారని యాలోచన.
ఎత్తుకు పై యెత్తుకుశ
మృత్తుగ అంతర్భాషణ

రకరకాల గ్రాహ్యములతో
రాత్రంతా వ్యూహ రచన
భరతమాత దీనస్వరం
బోధించెను పరమార్థం.

''బాలకృష్ణుడే మాయతో
బయటికొచ్చె చెరనుండి?
ఆగ్రా నెలా లంఘించె
నరివీరుడు జిజియ తనయు?

ఎలా తప్పు కున్నాడట
''ఎల్బా" చెర నెపోలియన్?
ప్రయత్నాలు నావైతే
ఫలితం పైవాడి తంతు.

తూరుపు తెలవారు తూంది
తోచిందొక కొత్త ఎత్తు.
పోలీసధికార్ని జూచి
''సార్కర్! ఒక పని వుం"దనె

సావర్కరు పిలుపును విని
"సంగతేమి?"టని యడిగెను.
"మరుగుదొడ్డి కెళ్ళా"లని
మరుగు పెట్టి మాటాడెను.

మరుక్షణమె భటులు నడువ
మరుగుదొడ్డి కెళ్ళినాడు.
దొడ్డి తలుపు బోల్టులను
దండిగ బిగియించినాడు

గాజు తలుపు మూయుటకై
"గౌను"ను తగిలించినాడు.
నీరుపోవు దారివెంట
నెమ్మదిగా జారినాడు.

బంధనములు తొలిగాయని
సంద్రములో సాగినాడు.
లోలోనే ఈదుకుంటు
లోతట్టునె మునిగినాడు.

గార్డే గమనించినాడు
గావుకేక లేసినాడు.
"సావర్కరు లేడం"టూ
చావుకేక లేసినాడు.

తల కనబడునేమోయని
తుపాకుల్ని పేల్చినారు
పట్టు బట్టి పట్టాలని
పట్టుదలను జూపినారు.

వేటగాడి బాణాలను
దాటిపోవు కురంగముగ
ఈదుకుంటు పరుగెత్తెను
బాధలేని చేపలాగ.

గాయాలే భారతహృది
గేయాలై వినిపించెను,
బాధించెడి నొప్పి, భావి
పుష్ప పుష్పాడిగ దోచెను.

ఓడరేవు గోదవరకు
ఓపికతో యీదినాడు.
పట్టుబట్టి ఎక్కబోయి
పడిపోయెను పట్టుజారి.

ఆత్మబలం తోడాయెను
అంతటి సంకల్పానికి,
నవనాడులు కూడదీసి
రేవుగోడ నెక్కిజూచె.

ఉత్తేజము పలుకరించ
ఊరుకులు లంకించినాడు.
స్వాతంత్ర్యం వచ్చిందని
చంకలెగుర వేసినాడు.

ఫ్రెంచి భూమిలో పులకలు
మించిన వూహల పరుగులు.
బ్రిటిష్ ప్రభుత, అధికారపు
బావుటాలు ఎగురవచట.

పట్టుకొనరు తననెవరని
పరుగు నాపుదా మనుకొనె.
వెంట బ్రిటిష్ పోలీసులు
వెనుకదిరిగి చూడగానె.

చిరువాహన మెక్కడాన్కి
చిల్లిగవ్వ లేదాయెను.
తెల్లవాడి పగ సెగలై
దారిగాచి వెంటాడెను.

ఫ్రెంచి పోలీసొకని జేరి
"మాజిస్ట్రేట్"ను జూపుమనెను.
దయమాలిన పోలీసే
దయ్యమాయె నాక్షణాన.

స్కాట్లండ్‌యార్డ్ పోలీసులు
సంతసమున పట్టినారు.
భరతవీర కిశోరాన్ని
బరబర లాక్కెళ్ళినారు.

న్యాయానికి అన్యాయం
నయవంచన విన్యాసం.
బ్రిటిష్ ప్రభుత అకృత్యం
ఫ్రెంచినేల అపవిత్రం.

మేడంకామ, అయ్యరులు
మరునిమిషం చేరినారు.
మార్సెల్సున దిగగానే
మరుభూమిని గాంచినారు.

ఓడలోన సావర్కరు
గోడమీద అయ్యర్జీ,
మేడంజీ గుండెజారి
బండబారి పోయింది.

చేజేతుల సావర్కరు
చేయిజారి పోయెగదా!
కొద్దిపాటి ఆలస్యం
కొంపముంచి వేసెగదా!

ప్లాను విఫలమైనందుకు
పలుమారులు చింతించిరి.
విధి విధాన నిర్దయాన్కి
విలపించిన ఫలమేమిటి?

స్కాట్లండ్‌యార్డ్ పోలీసులు
సావర్కరు జబ్బపట్టి
చితకబాద జూచినారు.
కుతకుతమని ఉడికినారు.

శివమెతిన సావర్కరు
సింహగర్జనము జేసెను.
"ఇదిగో! చూడండి బాబు
ఇంతటితో ముగియలేదు.

ఉరికంబం వైపునన్ను
ఉరికిస్తున్నారు గదూ!
ఏమైనా చేస్తానిక
ఎలాగైన చావెగదూ!

ప్రాణం పోతున్నగాని
ప్రాణం అభిమానమందు.
అవమానం చేయజూస్తె
అంతం చూస్తాను ముందు.

అభిమానము స్వంత ఆస్తి
అవమానం దరిజేరదు.
అనుయాయులు దూరమైన
ఆత్మబలము అసమానం

మీ భార్యా బిడ్డలెపుడు
మీ క్షేమం కోరుతారు.
వారి కుశలమే కోరిన
మర్యాదగ మసలుకోండి

అధికారుల వర్తనమున
అణుమాత్రం మార్పు వచ్చె
ఓడ జాడ బట్టినడిచె
ఎడన్ రేవు వద్ద నిలిచె

ప్రయాణీకులను మార్చిరి
"షష్టి" స్టీమరెక్కించిరి.
మహావీరవర్యు నొకని
"మరియా"లోనే వుంచిరి.

పందొందొందల పదిలో
జూలై రెండవ తేదిన
మరియా తన దారిబట్టి
భరతావని చేరువాయె

భరత వీర హస్తాలకు
బలవంతపు శృంఖలాలు.
అతనిగాంచి బావురుమనె
ఎర్రవాడ జైలు గదులు.

వీరగంధ సువాసనలు
విశ్వమెల్ల గుబాళించె
పాంస్ డెయిలీ న్యూసులో
పెద్ద పెద్ద వార్తలొచ్చె.

"లాహ్యూమ్‌సైట్'' పత్రికొకటి
లంపటమని ప్రకటించెను.
మార్సెలీసు నగరానికి
మచ్చతెచ్చు చర్యలనెను.

విశ్వపత్రికా రంగము
విసుర్లెన్నొ గుప్పించెను.
భారత్‌లో విచారణలు
భావ్యంకాదని తెలిపెను.

చేవలేని ఫ్రెంచియంటు
చెదురుమొదురు వార్తలొచ్చె.
ఫ్రాన్సు కతని పంపాలని
పలువార్తలు చుట్టుముటె.

సోషలిస్టింటర్నేషన్నల్
సమస్యలను లేవనెత్తి
చక్కనైన తీర్మానము
చేసి పంపె ఫ్రాన్సు చెంత.

ఫ్రాన్సు బ్రిటను పాలకులకు
పలు లేఖలు రాయించెను.
విదేశాంగ మంత్రులతో
విరివిగ చర్చలు సాగెను.

మధ్యవర్తి సంఘానికి
మతలబు చేద్దామనిరి.
ఒడంబడిక సంతకాలు
ఒండొరులూ చేసుకొనిరి.

చెవిటివాడి ముందరెన్ని
శంఖులూది తేం లాభం?
సంస్కారములేని బ్రిటిషు
సాంప్రదాయ దౌర్భాగ్యం.

స్పెషల్ ట్రిబ్యునల్ వెలసెను
సావర్కరు విచారణకు.
రెండు పెద్ద నేరాలని
రంగుబూసి చూపినారు.

నాసిక్ కుట్రకేసొక్కటి
నవ ప్రపంచ విదితమ్మట.
జాక్సన్ హత్యోదంతము
జగమెరిగిన దింకొకటట.

"సర్ బాపిలీ స్టాటు" గారు
సదరు చీఫ్ జస్టిసుగా,
"చంద్రాకర్" "హీటన్"లతొ
జారిడను"లు జస్టిసులుగ.

ముగ్గురు ప్రాసిక్యూటర్లు
ముందుకొచ్చి వాదించిరి.
హద్దులేని వాదనలకు
హంగులెన్నొ జోడించిరి.

తిలకుగారి మిత్రుడొకరు
"జోసఫ్ బాప్టిస్టా" గారు
"గోవింద్రావు గాడ్గిల్"తొ
''రంగనేకర్'' డిఫెన్సైరి.

మేడంకామా పంపెను.
మరియెన్నొ కాగితాలు.
లండన్‌లో దొరికినవి
ఇండియాలో సాక్ష్యాలు.

పందొందొందల పది
జూలై పది హేను చేదు.
బొంబాయిలొ విచారణకు
భారత ప్రజ కల్లోలము.

రాజద్రోహ నేరమనే
రాద్ధాంతం మొదటి కేసు.
ముప్పది తొమ్మిది మందిని
ముద్దాయిలుగా సిఫార్సు.

కోర్టుబయట నిషేధాజ్ఞ
కమీష్నర్తొ బందొబస్తు.
ముసుగేసిన కారునుండి
ముందుదిగెను సావర్కరు.

బాప్టిస్టొ వాదనలతొ
బ్రిటిష్ కోర్టు సంచలనం
జడ్జీలకు కొరకరాని
కొయ్యి అంటూ కలకలం.

"సావర్కరు బంధించుట
చట్టానికి వ్యతిరేకం.
మార్సెల్సున నిర్బంధం
మానవతకె నిందార్హం.

సవరించిన ''కోడు'' కలిపి
చట్టాలను చదివి చూడ
ఇండియాలొ కనిపిస్తే
ఇంచుక అది నేరమౌను.

ఎక్కడుండె సావర్కరు?
ఎందుకు బంధించినారు?
ఇండియాకు తరలిస్తే
ఇదేన్యాయ మౌతుందా?"

బాప్టిస్టొ వాదనలకు
బ్రిటిష్ జడ్జి తలవూపెను.
"రాజకీయ ఆశ్రయాలు
రాణించుటె ధర్మ'' మనెను.

సావర్కరు తన మాటలు
చక్కగ విన్పించినాడు.
'విదేశాల్లో ఆశ్రయాలు
విశ్వసమ్మత మౌనేడు.

ఫ్రెంచి గడ్డపైన నన్ను
పట్టుకొనుట అన్యాయం.
అంతర్జాతీయ న్యాయ
సూత్రాలకె భంగకరం.

రాజు తలచు కొన్నచో, కొ
రడా దెబ్బల కొదవేమి?
పర ప్రభుత్వ పాలనలో
పీడనకిక లేదులేమి?

బ్రిటిషు ప్రభుత స్వార్థముతో
బనాయించె తప్పు కేసు.
బలవంతపు విచారణకు
బదులిస్తే ఇక అభాసు.''

రంకునేర్చినమ్మలకిక
బొంకుటకేం సిగ్గురా?
దగుల్బాజి పాలకులకు
ధర్మమేమి దెలియురా?

ముగ్గురే ముద్దాయిలను
ముద్దుగ దరిజేర్చుకొనిరి.
అపూర్వర్లుగ మార్చిరి
ప్రూఫులెన్నొ చూపించిరి.

''సావర్కరు దేశద్రోహి.
సాక్ష్యాలను చూపుతాము.
విప్లవ సాహిత్య సృష్టి
పరబ్రహ్మ ఇతడందుము.

"మజినీ'' నలహాను బొంది
మిత్రమేళ పేరు మార్చె,
నంగనాచి విప్లవాన్కి
"నవభారత మండలి"గా

దేశదేశ విప్లవాల్ని
దాచిదాచి చదివినాడు.
"మజినీ" జీవిత చరితను
మరాఠీలో రాసినాడు.

విమల హృదయ యువశక్తికి
విప్లవ పాఠాలు నేర్పి
ప్రభుత పైకి యుద్ధానికి
ప్రబోధాలు చేసినాడు.

ఆయుధ కార్ఖానాలను
అన్ని చోట్ల దెరచినాడు
విదేశీయ ఆయుధాల్ని
వింతగ దెప్పించినాడు.

మిడిసిపాటు డింగ్రానట
ముదమారగ ప్రస్తుతించి
కరపత్రాలెన్నొ రాసి
కసికసిగా పంచినాడు.

ఇక్కడి పనులకు తోడుగ
ఇంగ్లండున నిర్వాకం,
రాజద్రోహ బుద్ధితోడ
రాజకీయ సెర్వాకం."

"నేతి బీరకాయ నిండ
నెయ్యెంతటి శాతముందొ
ప్రాసిక్యూషన్ వాదనలొ
పస అంతే శాతముంది."

హింసలతో బెదిరించిరి
హంసలుగా నిలబెట్టిరి.
మూడొందల సాక్షులంటు
ముందునిల్పి ప్రశ్నించిరి,

కోర్టువారు ప్రశ్నించిరి
కొసకు కొదమసింగమ్మును.
"ఏమైనా చెబుతావా
ఎందుకైన మంచిది'' యని.

దర్పమంత తనసొత్తుగ
దండిగ నిట్టూర్చినాడు.
"చెప్పుకొందు నిపుడే"యని
పగవులు చిందించినాడు.

"నాపై నేరారోపణ
వయవంచన మానవతకు.
సంబంధము లేదునాకు
సంబంధిత నేరాలకు.

ఇంగ్లండున కోర్టులుండ
ఇండియాకు దెచ్చినారు.
కుట్రలెన్నొ పన్నినారు.
కుతంత్రాలు చేసినారు.

ప్రజాతంత్ర కోర్టులచట.
ప్రజాద్రోహి కోర్టు లిచట.
నిరంకుశం సాగ దచట
నిత్యనిరంకుశమ్మిచట.

కావాలని తెచ్చినారు.
కాగితాలు నింపినారు.
ఇక్కడ నేనేం జెప్పను
ఎలా స్టేటుమెంటివ్వను?

వాద ప్రతి వాదనలను
వరుసగ సాగించినారు.
అరవయ్యేనిమిది రోజులు
అహర్నిశం వాదించిరి.

అరణ్యాన రోదనలను
ఆలకించు నాథులెవరు?
బ్రిటిషిండియా పాలనలొ
భరత ప్రజల రక్షకెవరు?

పందొమ్మిది వందలపది
ఇరవై మూడు డిసంబరున
కోర్టు జడ్జిమెంటు బలే
కర్ణ కఠోరము దోచెను.

''యువ జీవిత ప్రవాస
కారాగారము తోడుగ
సావర్కరు ఆస్తులన్ని
సర్కారుకు స్వాధీనము"!!

బోను నుండి సావర్కరు
సవరించెను తనగొంతును
"భారత్ మాతాజై ''యని
పలుమారులు నినదించెను.

యువ కిశోర గర్జనలతొ
యమునిని కోర్టు దద్దరిల్లె.
వాడవాడ దేశమందు
విప్లవాగ్ని ప్రజ్వరిల్లె

నారాయణ సావర్కరు
నడిచె నదే కేసులోన.
సప్తమాస కృష్ణ జన్మ
స్థాన ప్రాప్తి సిద్ధించెను.

వీరోచిత విప్లవాలు
విపరీతము భారతాన.
గ్వాలియర్ సతారాలో
గూఢ స్థావరములు దొరికె

ముప్పది రోజులు గడిచెను
ముందుకొచ్చె మరోకేసు.
అదే కోర్టు యీ కేసును
మసిబూసెను మాయజేసి.

''వందేమాతర గీతం
విప్లవ హృది సంధానం.
సావర్కరు సాహిత్యం
చదవగానె కల్లోలం.

బ్రిటన్ నుండి పంపించెను
బహురకాల పిస్తోళ్ళను,
పంపించిన పిస్తోలుతొ
కాల్చివేసెను జాక్సనును."

సావర్కరు తన తరపున
సంగతి వివరించినాడు.
"సదాచార సాహిత్యం
సృష్టించుట సంస్కారం.

ప్రత్యక్షముగా గానీ
పరోక్షమ్ముగా గానీ
జాక్సన్ మరణాన్కి నేను
జవాబ్దారి కానె కాదు.

నమ్మిన నమ్మక పోయిన
నిర్దోషిని" యని చాటెను.
నిదానముగ వాదించిన
నిలువలేదు న్యాయ మచట.

తేరగ వచ్చిన ఆస్తిని
కాలదన్ను వాడెవ్వడు?
ధర్మా ధర్మములనెంచు
ధర్మరాజు లేడచ్చట.

నెనరు కరువు టీ్రబ్యునలది
నెలలోనే తీర్పునిచ్చె.
పిచ్చివాడి చేతిలోని
పలుగురాయిలా వచ్చె

"మొదటి కేసు శిక్షతోటి
మొత్తానికి పొత్తులేక,
యావజ్జీవిత ప్రవాస
కారాగారము శిక్ష"ని

రెండు పాతికలు కలువగ
అరశతాబ్ది వరకు శిక్ష.
న్యాయ శాస్త్ర చరిత్రకే
మచ్చతెచ్చు మరణశిక్ష.

ధర్మ మాత పాదములను
దుర్మార్గం నరికేసెను.
మిడిమేలపు రాబందుల
మిడిసిపాటు పరుగాయెను.

అడగలేదు కోర్టువారు
"అసలు సంగతేమి?"టియని
గంభీరత తనసొత్తై
గర్జించెను క్రాంతిస్ఫూర్తి.

"బాధకలుగ లేదు నాకు
భారమైన శిక్షలు విని,
గండాలకు బెదిరిపోయి
గుండె పగులలేదు సుమా!

దిక్కులేక మైనగాని
దిగ్భ్రమ కల్గించలేవు.
ఈసరవెలి తీర్పులతో
ఊసులెంత కాలములే!?

ఇరవయ్యేడేళ్ళు నాకు
అరవయ్యేళ్ళనుభవాలు.
అమ్మ భారతాంబ స్వేచ్ఛ
రథచక్ర పుగాయమ్ములు.

ఈ రకాల కక్షలతో,
ఈ చట్టము శిక్షలతొ
నాదేశము స్వేచ్ఛనొందు
నవయుగ చైతన్యముతో

శివుడు, రాజాప్రతాపులు
శిక్షలనుభ వించలేద?
రాణీ ఝాన్సి బలిదానము
రగిలించెను నిప్పుకదా!

తానాజీ నానాజీ
అరివీరులు తాంత్యతోపె
స్వేచ్ఛారణరంగ దీప్తి
పుంజములై వెలుగొందిరి.

భారత స్వాతంత్ర్యరథం
బహుదూరములో నున్నను,
నాతమ్ముల త్యాగాల్తో
నడిచి గమ్యమే చేరును.

ఈనాడిది విఫలమైన
నానాటికి చేరువౌను.
భవిష్యత్తులో భారత్
బంగారపు కోటయౌను."

అంతట యధికారొక్కడు
అతి వ్యంగము నొలికించెను.
"పందొందొందలరవై లో
ప్రపంచాన్ని చూద్దువులే!"

సావర్కరు విశ్వాసం
సమాధానమై నిలిచెను.
"అంతవరకు మీ పాలన
ఉంటెగదా భారతాన"?

అంతర్జాతీయ న్యాయ
స్థానమ్మగు "హేగు"నందు.
అప్పీలును వేసినారు.
ఆశ మినుకు మినుకు మనగ.

వంతుకు దాసరి కాలును
వంకర యాడించినట్టు.
తెల్లవాణ్ని వరించింది.
కల్లకు లొంగిన న్యాయం.

మేధావుల విమర్శనా
బాణమ్ముల వర్షములట!
"వినాశాల కాలానికి
విపరీతపు బుద్ధు"లంటు॥

ప్రవాసాన శిక్షగడప
ప్రయాణమౌ సమయమాయె
తరలించే ముందు భార్య
తుదిసారిగ చూపులాయె.

తీయని కలలన్ని వండి
తనివిదీరు తరుణమ్మది.
సంధ్యారుణ వాంఛలతో
సంతసించు ప్రాయమ్మది.

దరహాసము చిందుమోము
చిరునీడల మయమాయెను.
వసంతాల వనములోన
విషవాయువు ప్రవహించెను.

అశ్రుధార ప్రవహించగ
అధరవ్వయ మదిరిపోయె.
ఎదయెదలో యాక్రందన
"ఎన్నాళ్ళీ ఆవేదన?

వంశాకురమైన కొడుకు
విధివ్రాతకు బలి నాడే!
గతియో పతి దేవుడంటె
గగన కుసుమ మౌతాడా?"

పతి యాజ్ఞను తలదాల్చిన
పడతి ఊర్మిళను బోలెను.
బుద్ధుడికై తపియించిన
సాధ్వి యశోధర బోలెను.

నయనాల్లో నిండెను పతి
అభయమేమి దొరకదాయె
విధిబలీయ మేమొగాని
విషాదాలె మిగిలిపోయె।

సావర్కరు తనివిదీర
సతిచూపున చూపుగలిపి
అనునయ వాక్యాలు బలికె
అది యెంతటి నిబ్బరమో।

"ఇటుచూడుము, యీ వైపుకు
ఇంచుక నా కళ్ళలోకి,
అదే పాత మనిషి నేను
అణుమాత్రం మార్పులేదు.

వస్త్రాలను జూచినీవు
విలపించకు, తలపోయకు.
వస్త్రములేపైన నేమి?
శస్త్రములై గుండెలుండ।

జరిగినదానికి యెన్నడు
జంకబోకు, జడవబోకు
జరగబోవుదానికి మరి
జిట్టనొంద ఫలమేమిక?

పదీ పరక లార్జించుట
పొట్టనింపు కోవడాలు.
పతీ సతుల విలాసాలు
పరమార్థం కానేరవు.

దారిద్ర్యం మూల్గుతూంది
దేశమాత పిలుస్తూంది.
త్యాగాలతొ జీవితాల
తర్పణాలు విడువుమంది.

దైవం అనుకూలిస్తే
దగ్గరౌదు నాతల్లికి.
ధైర్యం విడనాడబోకు
దైవస్మరణ మరువబోకు."

సమయమై పోయిందిక
స్వరం జీరబోయింది.
బావమరిది దరికిజేరి
భవ్యమంత్రి మొక్కటి జెప్పె

కలలో కన్పించినట్టు
ఎదవీణను మీటినట్టు.
సావర్కరు వదనము చిరు
నగవులకే ఆటపట్టు.

పాత గుడ్డ లొలిపించిరి
ఖైదుగుడ్డ లిప్పించిరి.
డోంగ్రె జైలు యావరణలొ
ఖైదిబిళ్ళ నిప్పించిరి

వస్త్రములను మార్చువేళ
విస్తరించె విషాదాలు.
వీరహృదిని తోసుకొచ్చె
వింత వింత తరంగాలు.

"విడిచేసిన వస్త్రాలను
విధి నాదరి జేర్చేనా?
బ్రతికి బయటి కొచ్చెనా
చితికి చచ్చిపోయేనా?

భావలహరి పొంగి పొంగి
బాధామయ మొనరించెను.
ఎంతెంతో ఆపేసిన
కొంతైనా తోసుకొచ్చె

సావర్కరు అస్తినంత
సర్కారే జప్తుజేసె.
పాతిక వేలపై ఆస్తి
ప్రభుత్వమే మింగివేసె.

పుస్తకములు వదలలేదు
దుస్తుల్ని విడువలేదు.
వేలం పాటకు పెట్టిరి
వెర్రి ప్రభుత నెనరులేదు.

మామగారి ఆస్తిగూడ
మాయ మాయె వేలములో
పుణ్యమూర్తి వదినమ్మకు
పూరి గుడిసె కరువాయెను.

రెండు శిక్షలొకేసారి
రావాలని సావర్కరు
అర్జినొకటి పెట్టుకొనగ
దర్జాగా కొట్టేసిరి.

తిరస్కరణ తెలుపుటకై
తరలొచ్చిన ఆఫీసరు
సానుభూతి హాస్యాలను
సంతరించె మాటల్లో

"వచ్చు జన్మ శిక్షగూడ
వచ్చె నిదే జన్మలోన
అనుభవించు మానాన్నా
అనుమానం వీడన్నా."

వార్త విన్న సావర్కరు
వరుసగూడ మార్చలేదు.
కంఠము గంభీరమాయె
కఠినాత్మకు జవాబుగా.

"కిరస్తాన్ని మరచినట్టి
కఠినమైన నిర్ణయాలు.
పునర్జన్మ వృత్తాంతము
ప్రవచించిన బహు నిజాలు.

హిందూ ధర్మము మీకిహ
ఇలవేల్పా నిపుడు నిజము.
హిందువులుగ మారితిరా
ఇదేనాకు సంతోషము."

ఆఫీసరు చేతులెత్తి
అవనతశిర మెత్తకుండ
కొరకొర చూపులు మానుకు
బరబర తన దారిబట్టె

కడగండ్లను దారిపైన
కర్తవ్యము బండినడక.
బడబానల హృదయానికి
భవిష్యత్తు మిగిలిందిక.

ఖైదీలను చితబాదు
క్రతినాత్ములు అధికారులు.
కొబ్బెరిపీచును పీకే
పనులను పురమాయించిరి,

కవితా నందన నమున
కలంపట్టు కరకమలం
నారనెంతొ లాగె లాగె
నరకయాతనల నిలయం.

దుర్భర జీవన సరళిన
దార్ఢ్యమైన ఆలోచన
మహారచన చేయాలని
మనసులోన శుభకల్పన.

# భూలోక నరకయాతన

డోంగ్రె జైలు మార్చినారు
బైకుల్లా చేర్చినారు.
అదికూడా మార్పుజేసి
"ఠాణ" జైలు కంపినారు."

సన్నకారు ఉద్యోగులు
సావర్కరు అభిమానులు.
హవల్దారు వార్డెన్లకు
అభిమానము అతని పనులు.

ఖూనికోర్లు కిరాతకులు
క్రూరరౌడి ఖైదీలూ
"బారిష్టర్ బాబం" టూ
బహు గౌరవ వందనాలు.

"ఈయనంటి లాయర్లే
ఇంకమనకు గతి" యంటూ
పశ్చాత్తప్త హృదయాలతొ
పరుగులిడిరి అతనివెంట.

తమ్ముడు నారాయణరావ్
తోటి ఖైదిగా చేరెను.
సమయానికి వార్తలెల్ల
సిబ్బందే చేరేసిరి.

ద్వీపాంతర వాసమేగు
దినము రానే వచ్చింది.
మరో రాము డడవులలొ
మురిసే కాల మొచ్చింది.

వీధులన్ని నిండిపోయె
వీరపుత్ర దర్శనాన్కి.
సమరశాన్క సంకెళ్ళతొ
సాగిపోయె ప్రవాసాన్కి.

ఖైదీ హృద్వీధుల్లొ
బాధామయ గాధాలెన్నొ।
మానవతను చెండాడిన
దానవ జనగణ మెంతొ.।

సావర్కరు స్వామియంటు
సగర్వముగ పలికినారు
కుర్తా ధరియించినారు
కుండ చేత బట్టినారు.

ఇనుపకంచ మాచేతికి,
ఇనుప గొలుసు లీచేతికి.
గొంగడి ఒక భుజంపైన
చదర మరో చంకలోకి

మొత్తము ఖైదీలతోడ
మద్రాసుకు రైలు నడిచె.
ఆంగ్లాధికారొక్కడు
అసాంతము వెంబడించె.

సావర్కరు మాట తీరు
సద్వినయం, చతురోక్తులు.
అధికారే చేతులెత్తి
ఆదరముగ ప్రణమిల్లెను.

మంచి కాపలాదార్లతొ
మద్రాసులొ బోటునెక్కె.
గూఢచార్ల పరీక్షలకు
గుణపాఠం చెప్పి పంపె.

పందొందొందల పదకొం
డవ సంవత్సర మందున.
జూనిరవయ్యేడు నాడు
చేర్పించారు స్టీమరున.

ఐ. యన్. యస్. మహారాజు
ఆనాటిది యా స్టీమరు
విప్లవ వీరుణ్ని మోసి
విలపించెను పరుగులలో.

ఇనప్పెట్టె పంజరమున
ఇమిడ్చారు, తోసినారు.
చీకటి గుయ్యారంలో
సావర్కరు జేర్చినారు.

ఇంజనురొద పెరిగిపోయె
ఎదను బాధ రేగినంత.
కకావికలమై పోయెను,
కలత నొంది మనసంతా.

"పసిప్రాయం కలలన్నీ
పండేనా శాపాలై।
మాతృ భూమి ఆశలన్ని
మిగిలేనా కడు వ్యథలై.।।

భారతమాతా, నీకదె.
బంగారం భవిష్యత్తు.
నేనులేక పోతెనేమి?
నా వారసులున్నారిట.

నీ చల్లని ఒడి గుడిల్లో
నా జీవన మెదిగె గదా,
మళ్ళీ నీ పాదధూళి
ధరియింతను ఎన్నాళ్ళకు?

మొగనిగొట్టినమ్మ బలే,
మొగసాలకు ఎక్కెనమ్మ.
పలుజిత్తుల తెల్లదొరల
పైశాచిక కృత్యమమ్మ!

అక్కడనే అంతమైతె
ఇక్కడికసలె రానుగా,
సైబీరియా ఎడారిలో
రష్యన్ బందీల లాగ.॥

నరరూపున పిశాచాలు
నన్నుచుట్టు ముట్టినాయి;
అండమాను ప్రవాసాన
అరశతాబ్ది పుంభ్రమతాయి"

మరుగుదొడ్డి దుర్గంధము
కడుచీకటి సహవాసము.
వీరుడు కోరిన మీదట
వెలుగిచ్చెను గవాక్షము,

మనిషి-మనసు మధ్యలోన
మారుమూల అంతరాలు.
ఆలోచన లోచనాలు
అంతట విసిరెను చూపులు.

జూలై నాల్గవ తేదిన
చేరువయ్యె అండమాను.
లంగరు వేసిన స్టీమరు
చివర వీడు కోలిచ్చెను.

స్వీయభావ లహరికదల
సావర్కరు జైలుజేరె.
"ఈద్వీపం నాదేశపు
దేహళియై నిలిచితీరు"

భారతాంబ భవిష్యత్తు
భాసించెను వూహలందు.
"భారత రక్షణకిదియే
బలమైందొక స్థావరమ్ము.

బాలభాను కిరణాలను
ముద్దాడిన యీ ద్వీపము;
తూర్పుతీర ప్రాంగణాన
తలమానిక మీ దీపము."

అండమాను ద్వీపం చెర,
అది ఒక భీకర నరకం.
జైలు వర్తులాకారం
గోడఎత్తు, భయంకరం

కాలికి సంకెళ్ళు వేసి
కదిలించిరి నాయకుణ్ని.
స్వేచ్ఛ చుట్టు కాపలాలు
శృతిమించిన ఆయుధాలు.

పనివారలు దానవులై
పంతాలకు సయ్యందురు.
రాజకీయ ఖైదీలకు
రౌరవాన్ని చూపుతారు.

జడలదయ్యా పవతారము
జైలరైన "బరీ" దొర
దయా, కరుణ దరిద్రముతొ
పంచరించు నెపుడా చెర

కర్కశాన్ని కాస్తదించి
కఠినత్వం తగ్గనిచ్చి
సావర్కరు చెంతజేరి
పంభాషణ పలుపజొచ్చె.

"నువ్వేనా మార్సెల్సున
నగుబాట్లకు లోనైతివి?
పారిపోయి, దొరికిపోయి
పరువు పొర వేస్కుంటివి.?"

"నేనే సావర్కరంటి
నిజముగానె తప్పకుంటి.
మార్సెల్సును నమ్ముకుంటి
మరుభూమని తలచకుంటి"

"చూడుభాయి సావర్కరు!
శాంతము. నా మాట విను.
ఇంగ్లీషు వాడినిగాదు
ఐరిష్ పౌరుణ్ని నేను.

నీకంటే వయసులోన
నిజముగానె పెద్దవాణ్ని.
ఐర్లండున విప్లవాగ్ని
నమితముగా రేపినోణ్ని.

ఐర్లండ్ స్వాతంత్ర్యానికి
ఐచ్ఛికముగ పోరాడికి.
అనుభవ పాఠాలు నేర్పె
నదియంతా వ్యర్థమ్మని.

మిత్రుడి వైనావు నీవు
మనసు సంతసించెనాదు.
న్యాయముగా నేనింతగ
నీతో మాట్లాడరాదు.

తప్పించుకు పోవాలని
తగవులాడరాదు సుమ్మి.
నరభక్షకు లున్నారిట
నములుతారు చూడు తమ్మి."

అలాగైతే మిత్రమా!
ఐరిష్ దేశీయుడివా?
ఎవడివైతె నాకేమిటి
అంతట ఒరిగేదేమిటి?

శక్తి యుక్తులుడిగి నీకు
భక్తి భావనలు వచ్చెను.
వయసు పెరిగి వేలాడగ
వృద్ధాప్యము దరిజేరెను.

అనుభవమేమో, చూడగ
అజ్ఞానము పెరిగెనన్న.
చంచాగిరి యధికారం
చలాయించు పెద్దన్నా "

బరీదొర తుర్రుమనెను
మిర్రి మిర్రి చూపులతో.
మసాలాలు తయారాయె
మొదటి సమావేశముతో.

మూడవ అంతస్తులోకి
మరునాడే మార్చినారు.
మొరటు, క్రూర పఠానుల్ని
మరునిమిషం నియమించిరి.

బరీదొర కంటి చలువ,
బరెలైరి పనివారలు.
ఖైదీలను హింసిస్తూ
కిల కిల కిల నవ్వువారు.

ఖైదీలను తిట్టుటకై
క్రూరహింస చేయుటకై
ప్రత్యేకపు తర్ఫీదులు
పాపాత్ములు పొందినారు.

ఎడాపెడా తిట్టుకుంటు
ఎక సక్కా లాడువారు.
తొడపాశం పెట్టుకుంటు
తమాషాలు చూచువారు.

ముస్లిములలో హిందువులలో
మత మౌఢ్యం నింపినారు.
ఒకరికొకరి కాపలాతొ
విభజించిరి, పాలించిరి.

సావర్కరు కారణాన
సందడియా ద్వీపమంత.
చూచిపోవు వారలతో
సంచలనము దినమంతా

ప్రముఖులు పలుసార్లు వచ్చి
పలుకరించి పోవువారు.
వచ్చిపోవు నౌకలలో
వరుసగ దిగి, ఎక్కువారు.

బరీదొర చెంత జేర
వెర్రిరేగి తిరుగువాడు.
అనుమతులను యిచియిచ్చి
మతి గతి సుతి తప్పువాడు.

సావర్కరు రాకముందే
సత్పురుషుల ఉనికి యచట
గణేశ్‌బాబు సావర్కరు
వామనారావు జోషీలు.

చైతన్యం శంఖ మూది
చిక్కుకున్న విలేకర్లు.
బల్వంత్ ఫడ్కేతో గూడి
బహుదిరిగిన క్రాంతికార్లు.

ప్రథమ స్వేచ్ఛ సంగ్రామం
సమరయోధు లుండినారు.
పోరాటపు ఒరవడి విని
పరవశించి పోయినారు.

సంతసించి రెంతగానో
సావర్కరు సద్బుద్ధికి.
నీరాజనములు పలికిరి
వీరవరుల విప్లవాన్కి.

చండాలుడు బ్రిటీదొర
చండశాస నుండాయెను.
బ్రిటిష్ దొరల కాళ్ళుబట్టి
భూలోకపు యముడాయెను.

విప్లవాల పేరు వింటె
విసావిసా వదరువాడు
తిరుగబడ్డ వీరుల కడు
రసాభాస జేయువాడు.

రాజకీయ ఖైదీలకు
యమరాజును తానంటూ,
ఎద్దులుగా మార్చి పెద్ద
గానుగు దింపించువాడు.

మూర్ఛ వచ్చి పడిపోతే
ముఖం మాడ్చుకునే వాడు.
కళ్ళు బైర్లుకమ్మి పడితె
కసిదీరా దిట్టువాడు.

ఎనిమిది మందొకేసారి
దొడ్డికెళ్ళి రావాలనె.
పనియైనా కాకున్నా
పరుగెత్తుకు రావాలనె.

రాకపోతె ఈడ్చువాడు
రక్తంతో జూచువాడు.
ఒక దినమున మూడుసార్లె
శంకలకై వదులువాడు.

మధ్యలోనె వచ్చిచస్తె
ముంతలోనె చేయాలనె.
తనగదిలో భద్రపరచి
తానె శుభ్ర పరచాలనె

రోజుకు తొమ్మిది గంటలు
రక్త సిక్తములు కరములు:
పని మధ్యలొ శంకవస్తె
పూర్తవాలె నిలుచుండగ.

మానవులకు పశువులకేం
మార్పుకాన రాదచ్చట.
విశ్రాంతికి నోచుకోరు
వినోదాలు లేవచ్చట.

అవినీతిని ఆదరించి
అధికారులు మెచ్చువారు.
ఖర్చులు ఖైదీల పేర
కైంకర్యం దొరలపేర.

ఎండవాన చూడకుండ
ఏదైనా తినాలనిరి
పక్కఖైదితో మాటలు
పెద్ద తప్పు. శిక్షలనిరి.

తప్పు చిన్నదైనగాని
దండిగ దండించువారు.
ఒకే లేఖ ఏడాదిలో
ఇంటికెళ్ళ నిచ్చువారు.

మురికికంపు జలములనే
ముక్కుమూసి త్రాగుమనిరి.
అన్నం పారేస్తె తిరిగి
అదే యెత్తి తినిపించిరి,

"ఇక్కడ మించిన నరకము
ఎక్కడో లే"దను వారు
దుక్కలాంటి వారుగూడ
చిక్కిపోయి చచ్చువారు.

జైలునిండ రాక్షసాలు
జబర్దస్తి జీవితాలు.
ఏనుగులా గెళ్ళినోడు
పీనుగులా తిరిగివచ్చు.

జానెడంత గదిలోపల
మూరెడంత మనిషి వసతి.
ఇరుకుజైలు గదిలోపల
ఇమిడెను యమునాబాయ్ పతి.

వెరవ లేదు కష్టాలకు.
వైరాగ్యం ఆవహించె.
యోగిలాగ వ్యవహరిస్తు
భోగ భాగ్యములను మరిచె.

గానుగు దిప్పాలి గనుక
గానుగెద్దు జీవితమది.
తొమ్మిది గంటలు రోజుకు
తొణక్కుండ పనిఉనది.

కరములు పీచునులాగిన
స్వరములొలికె మదిలోపల.
పనిజేస్తూ మస్తిష్కం
పసిడి కవిత ల్లుచుండె.

బాధించాలని తలంచె
జరీదొర తెగింపుతో.
తోటి ఖైదీలెందరినొ
తూలనాడె మాటలలో

సాంత్వన వచనామృతరస
స్వాదన చేయించువాడు.
గుండెదిటవు వుండాలని
గండం కడతేర్చువాడు.

"బయట స్వేచ్ఛ పోరుకన్న
రైటు జైలు జీవితాలు.
చేదు అనుభవాలు మనవి
చేదుకొనును ముందుతరం"

బందిఖానా బ్రతుకులకు
భయోద్విగ్న అమాయకులు
పిచ్చిపట్టి పలవరించి
ప్రేతాలుగ మారువారు.

జైలు సూపరింటెండెంట్
జాలి గుండెలున్న వాడు.
అయినాగానేం లాభం?
నిందకు భయపడేవాడు.

"ఖైదీలను హింసిస్తూ
కఠినముగా మెదలా"లనె
అనాగరిక ఆదేశం
అసహాయత నెత్తిచూపె.

బలిసిపోయి బ్రీదొర
పరిహాసము చేయబోయె.
"పీచునుండి గాస్గు పనికి
ప్రమోషనే కొట్టావోయ్"

యోగిలాగ కన్నులెత్తి
మూగచూపు చూడగానె
బ్రీదొర వణికిపోయి
గంగ వెర్రు లెత్తిపోయె.

బొంబాయి యూనివర్సిటీ
"బియ్యే డిగ్రి రద్దు" అనెను.
తాకీదులు పంపించెను.
తమ వంతిది అనిపించెను.

మదిలోపల కైత పొంగు
చేతుల్లో నూనెగాన్గు.
నిరసించి ఒకే క్షణం
వారిగెగాన్గు గోడమీద.

స్పృహను పొంది లేచితానె
శరీరాన్ని చూచుకొనెను.
"దుమ్ముకొట్టు కుందెగాని
దమ్ము నేమి వదలలేదు.

మూడునాళ్ళ ముచ్చటయా
మనిషి జీవితం గాదా?
మరుభూమిని జేరునాడు
మనవెంటేం రాదుగదా.!

సంకట కాకీర్ణ మార్గ
సంబరాలు యివి కావా।
స్వయం స్వీకృతాలైతే
సుఖమెక్కడి నుండి వచ్చు?

రోట్లో తలకాయ వుంటె
రోకటి పోటుకు భయమా?
దేశమాత సేవజేయ
పాశవికత కిక భయమా?

తనకు తోసె తర్కించెను.
తమాయించి పనిజేసెను.
దేశవాణి జ్ఞాపకాలు
ధీరత్వము నింపేసెను.

పంచమ జార్జికి యచ్చట
పట్టాభిషేకోత్సవమట
ఢిల్లీ దర్బార్లో గూడ
జాతరంటు ఉత్సవాలంట.

"రాయితీలు ఇస్తా"రని
రంగురంగు వార్తలొచ్చె.
"ఖైదీలకు విడుదల"యను
కమ్మని వార్తలు వచ్చె.

"బారిష్టరు బాబుకింక
ఐర్రిగోడ వుండదటా"!
"ఊహాగానాలు జేసి
ఉప్పొంగొట ఎందకంట?"

## వీడిన సంకెళ్ళు

మహమ్మారి పాలనలో
మానవత్వ ముంటుందా?
మాయదారి పాలకులకు
మమత, క్షమత వుంటుందా?

ఒక్కొ యేడాది శిక్ష
కొక్కొనెల రాయితీట!
బారిష్టర్ బాబుకు యిది
వర్తించదు నిజమేనట!!

కడలితల్లి తరంగాలు
కదలికలను ఆపేవా?
కాలచక్ర గమనమ్ములు
కర్తవ్యం మానేవా?

సావర్కరు సాహసాన్కి
స్వజాతీయ విప్లవాన్కి
రష్యా"మాక్సింగోర్కి"
రచయిత స్పందించిపలికె.

"జాతి కొరకు విప్లవాలు
నీతిదాయకాలే" యని.
ప్రభుత్వమున కాక్షేపణ
పత్రమొకటి పంపించెను.

మేధావుల నిశిత చర్చ
మహామహుల వ్యాసరవళి
దున్నపోతు మీద వాన
కురిసిన చందమ్మాయెను.

కనీసమగు సౌకర్యము
ఖైదీలకు కావాలని
జైలులోనె పద్యమాల
ఝండా లెగరేసినారు.

పలురకాల పత్రికలతొ,
పుస్తకాలు కావాలనె.
రాజకీయ ఖైదీలను
రౌడీలుగ చూడొద్దనె.

నూనూగు మీసాల మెరుపు
నూతన యవ్వనులు గూడ,
విప్లవ వీరుల గమకము
విపరీతము జైలులోనె.

పీచు పీకు పనులమధ్య
పెద్ద గాన్గు నడకల్లో
సావర్కరు నీతి బోధ
సంచరించె నందరిలో.

గదులపైకి జూచుకొనిరి
గవాక్షాల నుండి వినిరి
భాస్వరస్ఫుట సదృశముల
భావ ప్రచారం మునిగిరి.

భావాలను ప్రకటిస్తే
బడ్రీదొర తలనొప్పులు.
పుస్తకాల వూసెత్తితె
పొలికేకలు, పులికేకలు.

"ప్రపంచాన విప్లవాన్కి
పుస్తకాలె కారణ"మని
సూపర్నెంటుతొ జెప్పి
చల్లగ వారించినాడు.

సావర్కరు మాట సరళి
సూపర్నెంటు సంతసం.
పుస్తకాలు చదివేందుకు
పర్మిషన్లు మరు నిమిషం.

నిర్విద్యా ఖైదీలకు
విద్యాగంధము బూసెను.
పుస్తకాలు చదువు వరకు
ప్రోత్సాహము కల్పించెను.

హిందూ దేశం ఏకత
హిందీ భాషన వుందని
నాగరిలిపి అందాలను
నయనానందము జేసెను

జైలులోన అధికారులు
జల్సాలకు మరిగినారు.
నరకాసుర వారసులై
నానాటికి పెట్రేగిరి.

కేరింతలు కొట్టుకుంటు
కారుకూత కూయువారు.
గణేశ్‌బాబు సావర్కర్ను
గద్దించిరి, హింసించిరి.

జైలుస్థితి గతులెవ్వియు
జనావళికి తెలియరావు.
కంపుగొట్టు వార్తలేవి
కటకటాలు దాటిపోవు.

హోతీలాల్ ఖైదియొకడు
హింసలెల్ల వర్ణిస్తూ
సురేంద్రనాథ్ బెనర్జీకి
సవివరముగ లేఖరాసె.

విప్లవ వీరుడె యతండు
వినయమెంతొ ప్రదర్శించి
గుట్టుగ ఒక లేఖ రాసి
కలకత్తా పంపి చూచె.

బెంగాలీ పత్రికల్లో
బహుప్రచార శీర్షికలతొ
హోతీలాల్ పేరుతోనె
హాటు న్యూసు అచ్చాయెను

బర్రీ శివమెత్తి యాడి
భంగపాటు జెందినాడు.
కోతి నిప్పు దొక్కినట్లు
కుప్పిగంతు లేసినాడు.

బెంగాలీ బాబు "ఇందు
భూషణ్'' జబ్బు వాతపడె.
గుర్రు గర్రు బర్రీదొర
గానుగ దింపించినాడు.

వేధింపుల వలన జిక్కి
వేదన భరియించలేక
చీటొక్కటి రాసిపెట్టి
చావువలచె బ్రతుకలేక.

బర్రీ యా చిట్టితంతు
బయటకు రానీయలేదు.
పిచ్చిరేగి చచ్చాడని
పంపె నివేదిక పెద్దది.

హుషారైన ఖైదియొకడు
"ఉల్లాసకర దత్త''తడు.
విద్యుత్ షాకుల నివ్వగ
వెర్రోడై పోయినాడు.

''నీగ్గూడా పిచ్చెక్క''ని
నసిగినాడు వీరునితో.
"నీ మతి గతి తప్పగానె
నా సంగతి చూద్దా"మనె

వీర నానిగోపాల్జీ
విప్లవాగ్ని కణమాయెను.
నిరాహార దీక్ష బూని
నలభయైదు రోజులాయె.

తర్కించిన సావర్కరు
తానుదీక్ష బూనినాడు
ఇతని దీక్ష వార్త దెలిసి
గోపాల్ విరమించినాడు,

విదేశాల విమర్శలకు
విస్తుబోయి తెల్లదొరలు
అండమాను ఖైదీలను
అచట నుండి మార్చుమనిరి.

అండమాన్లో వుండిపోతె
అదనపు సౌకర్యాలట.
బట్టలు యిప్పించెదరట
భోజన సౌకర్యాలట.

పందొమ్మిది వందల పం
దొమ్మిదవ సంవత్సరం
భయంకరపు జబ్బొకటి
బాధించెను, వేధించెను.

ఎనిమిది సంవత్సరాలు
ఎట్లెట్లో గడిచిపోయె.
కార్యక్రమ మెలాగున్న
కాలచక్ర భ్రమణమాయె.

యమునాబాయ్, మరిదితోడ
తన పతినిక చూడాలని
అండమాను దీవికడకు
గుండె పొంగ విచ్చేసెను.

ముగ్గురన్న దమ్ములచట
ముదమారగ జూచుకొనిరి.
యమున హృదయ ముప్పొంగగ
అవని జారె కనులనీరు.

"తమ్ముడు మరదలు వచ్చి
తపనతోడ పెద్దన్నయ
పులకరించి పలుకరించ
పూనుకొనెను ఎదపొంగగ.

కాని తనదు కాంతామణి
కాలధర్మ మొందిందని
గణేశుండు వినినంతనె
గుండెమూగ, నీరునిండె

తల్లిలాంటి వదిన దలచి
తల్లడిల్లె సావర్కరు.
పసిడి తల్లి అమ్మేదని
పలవరించి, ప్రచలించెను.

విహ్వలమతి తన సతితో
ఓదిగా సంభాషించెను.
"కష్టాలే కలకాలము
కలహించవు మనతో"నని.

శారీరక శ్రమదప్పెను.
సంవత్సర కాలములో
బ్రిదొర మరణించెను.
బక్కచిక్కె సావర్కరు.

బందులు సత్యాగ్రహాల్తో
భారత ప్రజ ఆందోళన.
పస జూచిన ప్రభుత్వాన
పనికిరాని పరిపాలన.

రాజకీయ ఖైదీలతో
రసాభాస మానుమనిరి.
బలిపీఠము జైలు నుండి
భారత్ పంపించుమనిరి,

పందొండొందల యిరవై
యొకటో సంవత్సరాన
మే మాసము ఎండల్లో
భరతావని కంపించిరి.

వీర భూమి మాదంటూ
వీరవరులు దుమికినారు.
కేరింతలు కొట్టుకుంటు
కౌగిలిళ్లో మురిసినారు.

వందేమాతర నినాద
చందనాలు చిందినారు.
"జై జై మాతా" యంటూ
దిక్కులదర గొట్టినారు.

స్వాగత సల్లాపాలతో
సాహసికుల నినాదాలు.
"జాతీయ విప్లవ జ్యోతి!
జనగణాల వందనాలు."

అలీపూరు జైలు వారిని
ఆదరించె మొట్టమొదట.
గణేశుణ్ణి వేరుజేసి
కదిలించిరి బిజాపూరు.

అనారోగ్య మావహించె
అన్న గణేశ్ బాబు గారిని.
పదహారు మాసాలుంచి
ప్రసాదించినారు ముక్తి.

రణసింగము జైలుమార్చి
రత్నగిరికి పంపినారు.
వెర్రిగ బాధల ముంచి
ఎర్రవాడ మార్చినారు.

సావర్కరు విడుదలకై
సాగిపోయె ఉద్యమాలు.
ఉవ్వెత్తున లేచి తరలె
యువతరంగ తరంగాలు.

సభలు సమావేశములలో
సంధించెను సవాళ్ళను.
ఏనోటను వింటున్నా
అదేమాట వినిపించెను.

షరతులు పెట్టేసినారు
సావర్కరు విదుదలకని.
రత్నగిరిని దాటొద్దని
రాజకీయ మొదలాలని.

పందొందొంధల ఇరవై
నాల్గవ సంవత్సరాన.
జనవరి ఆరవ తేదిన
జనావళిని తాగలిసెను.

జైలు జీవితాన్కి స్వస్తి
జాలువార్చె దేశభక్తి.
ఆరోగ్యం తరిగిపోయె
అంతరంగ మెదిగిపోయె.

ఆంక్షలెన్ని విధించినా
అవరోధా లంతరించె.
"భరతమాత సేవకొరకె
భావికాల"మని చెప్పెను.

# రత్నగిరి-నాసిక్-రత్నగిరి

భారత దేశోన్నతికై
భావిభాగ్య భారతాన్కి
భారతీయ ధర్మాలే
బంగరు బాటని దలంచె.

"జాతీయ విప్లవం మన
జాతికి ఊపిరి" యనెను.
హిందు జాతి సంఘటనే
ముందు జరిగి తీరా''లనె

రత్నగిరిలో తిష్టవేసి
రంగప్రవేశము జేసెను.
"జరుగుబాటు ఎలా?" యనిన
"జరుగుతుంది చూడు''మనెను

"రత్నగిరి హిందూ సభ"ను
రయమున స్థాపించినాడు:
మిత్రుల ప్రోత్సాహముతో
మిగుల సంతసించినాడు.

"హిందు జాతి ఏకత్వం
ఇలాతలంలో సాధ్యం.
వీరశివా వుత్సవాల్లో
వీర రసం పొంగా"లనె.

ఉత్సవాల సభలో అమి
తోత్సాహం. ప్రసంగాలు.
సావర్కరు భాషణాలు
చేతన శ్రీకేతనాలు.

"హిందూ ధర్మ మీభువిన
ఇంపైనది తెలుసుకోండి.
అంతః కలహాల వల్ల
నంతరించు తెలుసుకోండి.

మనచరిత్ర మనకు సాక్షి
మరువరాదు చేదుగతం.
విడిపోతే పడిపోతాం
విమర్శలకు గురియౌతాం.

అసైక్యతకు లొంగిపోయి
అసూయలను పెంచినారు.
స్పర్థలతో మన పూర్వులు
చరిత్రనే మార్చినారు.

కష్టాలకు కారణాలు
కలహాలే కాదా మరి.।
ఐకమత్య భావనతో
ఔను దేశ రక్షణ సరి.।।

చరిత్రలను చదివేస్తూ
యదార్థాల్ని మరువకండి.
ధర్మరక్ష దృఢ దీక్షకు
దూరంగా వుండకండి.

అస్పృశ్యత ఆటవికం
ఆటంకము మన ప్రగతికి.
అంటరాని తనమనునది
కంటకమ్ము మన జాతికి

భారతీయ విప్లవాన్కి
భంగపాటు లేదిప్పుడు.
విజయం తథ్యం. భారత
వీరులమే మన మెప్పుడు.

శ్రమ శక్తిని మరువరాదు
భ్రమలచెంత జేరరాదు.
నైతిక విలువే మనిషిని
నిలువనిచ్చు మరువరాదు.

వసుధైక కుటుంబకమ్ము
వసుధ మనదు విశ్వాసం.
భ్రాంతి వీడి యోచించుటె
హిందు జాతి విశ్వాసం.

మన వునికిని చూచుకుంటు
మన శక్తిని పెంచుకుంటు,
వ్యక్తిత్వము నిలుపుకుంటు
వ్యవహారము సలుపుమంట.

జనులే బలహీనులౌతె
జాతి ఖ్యాతి రీతిసున్న
భరత జాతి బలపడితే
భారతాంబ రక్ష మిన్న.''

సావర్కరు భాషణవిని
స్పందించెను బుధగణములు.
జనవాహిని వార్నిధియై
జగజగాల నూగించెను.

ఆ సమయంలోనె ప్లేగు
వ్యాధి యొకటి దాపురించె.
జనగణమన కల్లోలము
జన సేవకు కదలిండనె.

పందొమ్మిది వసంతాలు
పంతాలతొ గడిచిపోయె.
ప్రభుత్వానుమతి పొంది
తిరిగి నాసికకు జేరెను.

మధురభావ తరంగాలు
మదినిండా పొంగిపొరలె.
విప్లవములు నేర్పించిన
విమల నగరు నాసిక్‌లో.

నాసిక్ ప్రజ హృదయాలలో
నయుభావన, ఆరాధన,
పురవాసులు స్వాగతించి
పౌరసభను జరిపించిరి,

మహారాష్ట్ర ప్రజ తరపున
మహానిధి సమర్పించగ
కృతజ్ఞతా భారంతో
కదలిపొంగె మనసు గంగ.

నవచేతన ముప్పొంగగ
నాసిక్‌లో నివాసమ్ము.
హిందు జాతి జాగృతికై
అక అంతట ప్రయత్నమ్ము.

అస్పృశ్యత నివారణకు
అహర్నిశం శ్రమించెను.
స్వార్థ సనాతనుల ఎత్తు
చిత్తు చేసి చూపించెను.

నాసికు దగ్గర గ్రామము
"భగూరు"లో సభలు జేసె.
హరిజన సోదరుల తోడ
హరినామ స్మరణ జేసె.

సామూహిక భోజనమున
సత్సంగము, సద్భావన.
సమ సమాజ సమభావ
సంభాషణ సంతర్పణ.

"వేదమాత బుక్కుల సం
క్రాంతి దాత మన ధర్మం.
మత మౌఢ్యం, పెనుభూతం
శృతికలిపిన దౌర్భాగ్యం.

స్వీయరక్ష ణోపాయం
భరత జాతి కర్తవ్యం
మతం మార్చుకున్నవారు
మాలివస్తె సౌభాగ్యం,"

అద్వితీయ సావర్కరు
కాక్షలెందుకింకా"యని
బొంబాయి శాసన సభలో
పేలిపోయె ప్రశ్నలగని.

బొంబాయి సభ చర్చలన్ని
బూడిదలో పన్నీరై,
"ప్లేగు పీడ వదిలిందిక
రత్నగిరికి మరలు" మనిరి!!

"బారిస్టర్ పాసైతిని
పట్టానా కివ్వా"లని
పిటిషనొకటి సమర్పించి
పట్టుబట్టె హైకోర్టును.

తెల్లదొరలు తమ చెంతన
గల్లంతే న్యాయమనిరి.
"పట్టా నీకివ్వ" రంటు
పొట్టి జవాబొకటిచ్చిరి.

కాలం కలిసొచ్చినపుడు!
కాలుమోపు తావిచ్చట
నాన్నా మరిపోయి రమ్ము
నాసికు నిను మరువలేదు!!

రంగం మారింది తిరిగి
రత్నగిరికి చేరుకుంది.
"చేవ చచ్చేదాక దేశ
సేవ చేయా"లని యుంది.

రత్నగిరిన మిత్రులెల్ల
రాచబాట నీ మాటని
హిందుత్వమె శ్రేయమ్మని
ముందు బాట చూపిమనిరి.

డాక్టర్ షిండే ఘనుడు
ధర్మానికి స్నేహితుడు.
సొపర్కర్నాదరించి
సొదర ప్రోత్సాహమిచ్చె.

ప్రజాసేవ తత్పరతన
పత్రికాధిపతులు, కవులు,
మేధావులు, వుద్యోగులు
ముందుకొచ్చి నిలిచినారు.

పండితులను, పామరులను
పరగ నొక్కచోట జేర్చి
హిందూ సంఘటన జేయ
ముందువిలిచి బాట జూపె

మన జాతికి శక్తినిస్తె
మన దేశమె సౌభాగ్యము.
కలతలు కల్లోలాలను
కసిరి తరిమి కొడదామిక

శాంతి రక్ష సేయుటకై
క్రాంతికి మన స్వాగతమ్ము.
ఆత్మరక్షణార్థమె మన
ఆందోళన తప్పుకాదు.

స్వజాతీయ విప్లవ సౌ
గంధ్యమె చైతన్య మన్న
వి జాతీయ వ్యామోహము
వినాశమే ఎన్నడైన."

భావలహరి జనతమునిగి
భవిష్యత్తు నూహించెను.
స్ఫూర్తి కళిక వెలుగుల్లో
సురుచిర పథగాములైరి.

మన జాతిన సంఘటనము
మత మౌఢ్యులు నిరసించిరి.
విదేశాల తొత్తులెచ్చొ
విమర్శలను కురిపించిరి.

మతం పిచ్చి మౌల్వీలట
తమంలోనె మునిగినారు.
తూలనాడి సాగదీసి
తర్కానికి దిగివచ్చిరి

దారిదప్పు పెద్దలతో
ధర్మచర్చ లెన్నొజేసె.
నేర్పుజూపి, నిదానించి
నోటికి తాళమ్ము వేసె.

భారతాంబ ముద్దు బిడ్డ
బాబసాహెబంబేడ్కర్,
సావర్కరు కృషిని పొగిడి
సవినయ అంజలి ఘటించె

"సమ సమాజ స్ఫూర్తిదాత
సంఘసేవ ద్రిష్టయతడు.
సంస్కృతి సాగరమంథన
సదాచార బ్రిహ్మయతడు."

వృత్తి రాజకీయాలను
గుత్తగ సాగించువారు.
సావర్కరు పథమందున
సవాలంటు నిల్చినారు.

మలయ పవన గమనమ్ములు
మల్లెపూల సురభిళములు
అడ్డుకొంటె ఆగేవా,
ఆదమరచి నిలిచేవా?

సాహసించి సావర్కరు
సాగిపోయె మున్ముందుకు.
తరుణ జనా లెందరికో
తగిన ధైర్య మిచ్చేందుకు.

"వారలంత కూడివచ్చి
వరుసబెట్టి ప్రశ్నించని
వంచన శిల్పము నెంచుకు
వక్రిభాష్య మందించని.

లక్ష్యం లక్ష్యమే కాదు
కక్ష పెంచరాదు సుమా!
స్వాతంత్ర్య సమరస్ఫూర్తి
సమైక్యతకె వోటు సుమా!"

పందొందొందల యిరవై
యేడో సంవత్సరాన.
దయచేసెను గాంధీజీ
దర్శించగ రత్నగిరిని

సజ్జనగణ సభలందున
చతురభాషణలు జేసెను.
సావర్కరు ధైర్య గుణం
సాహసముల కొనియాడెను.

సావర్కరు జ్వరతీవ్రత
సభకు కదలనీయలేదు.
దర్శనానికై చీటిబంప
దయచేసెను గాధీజీ.

గాంధీ కస్తూర్బాలను
కడు ప్రేమన స్వాగతించె.
బ్రహ్మపుత్ర యమునల సం
గమ స్థానము గోచరించె.

స్వాతంత్ర్య సమర కృషికి
సంభాషణ సాగించిరి.
భారతాంబ పాదపూజ
పుష్పాలను కీర్తించిరి.

ధార్మిక విషయాల గూర్చి
దేశ రాజకీయముపై
సాంఘిక సంస్కరణలపై
సాదరముగ చర్చసాగె.

అభిప్రాయ భేదమైన
అంతరంగ మొకటాయెను.
దారులు వేరైనగాని
గమ్యమేము ఒకటాయెను.

ఒకరంటే ఇంకొకరికి
ఒద్దికైన అవగాహన.
జాతి స్వేచ్ఛ రణ రథముకు
చెరో చక్రముగ దోచెను.

ఇంతకు ముందొక సారిగ
ఇంగ్లండున కలిసినారు.
ఇండియాలో సంభాషణ
ఇదే మొదటి, చివరిసారి.

# సంఘ సంస్కరణ జాతీయదృక్పథం

స్వేచ్ఛను సాధించుటకై
సవాలక్ష ప్రయత్నాలు.
జనతతి జాగృతి కొరకై
మన విద్యుద్భాషణాలు.

స్వేచ్ఛను సాధించుటకై
సంఘ సంస్కరణ ముఖ్యం.
హిందూజాతిని వలచిన
హేయ నిష్క్రమణ పౌఖ్యం

"పనిపిల్లల హృదయాలే
పరమాత్ముని ఆలయాలు.
పిల్లలు బడికెళ్ళువేళ
కులపంథా లెందుకు?" యనె.

"హరిజన గిరిజన బాలురు
హైన్యత భావాలు వీడి
పలు కులాల పిల్లలతో
పాఠశాల కెళ్ళా"లనె.

సభలెన్నో నిర్వహించి
సర్కారుకు రాసినాడు.
వివిధ క్షేత్ర పత్రికలకు
వ్యాసాలను రాసినాడు.

ఛాందసులిది ప్రతిఘటించి
ఋజువింప దలచినారు.
అగ్రవర్ణ బూర్జువాలు
ఆగ్రహించి దుమికినారు.

సద్బుద్ధితొ సావర్కరు
సంయమనము చూపించెను.
సాహసించి ముందుకేగి
సవినయముగ విన్నవించె.

"కులమత భేదాలవల్ల
కుళ్ళిపోయె మన సంస్కృతి.
వేద శాస్త్ర పురాణముల
వెరికులం పేరు లేదు.

వర్ణాశ్రమ ధర్మాలను
వృత్తులతో ముడిపెట్టిరి.
పుట్టుక అప్రాధాన్యం
పుర్రె గుణం ప్రాధాన్యం.

హరిజనుడనగా నెవ్వడు?
హరికి ప్రియంబైన వాడు.
తరతరాల దౌష్ట్యానికి
తలవంచిన నిర్భాగ్యుడు,

గిరిజనులనగా యెవ్వరు?
గాండీవులు ఒక్కొక్కరు.
సాటి మానవాత్మలు, మన
సంస్కృతి వారసులు వారు.

పరులతోడ సమానముగ
పన్నులు చెల్లిస్తారు.
అందరితో సమానముగ
అవయువాలు వున్నవారు

భగవంతుడి సృష్టిలోన
భేద భావ మసలులేదు.
సవర్ణులని, వివర్ణులని
శాస్త్రాల్లో చెప్పలేదు

బడిలో గుడిలో వీరలు
భయం వదలి కనబడాలి
పరమాత్ముడి జ్ఞాన భిక్ష
ప్రజలందరి కలవడాలి.

వీరే ముసిల్లములైతే
క్రైస్తవులుగ మారిపోతె,
గౌరవమందిస్తారే!
సోదరులని యంటారే!!

పశుపక్ష్యాదుల చెంతన
పాటించరు అస్పృశ్యత
కపట కుల ప్రభావమహిమ!
కసరుతాడు సాటివార్ని!!"

ఇంటింటికి తిరిగి తిరిగి
ఎన్నిసార్లో చెప్పి చూచె.
మనసులలో మార్పుకొరకు
మనసారా ప్రయత్నించె.

దుర్మార్గం దృష్టికొస్తె
తనకేమని వదలలేదు.
జిల్లా మాజిస్ట్రేటుకు
జాబులెన్నో రాసినాడు.

"దగుల్బాజి సర్కారుకు
దరఖాస్తులు ఎందు?" కనగ
"ధర్మం-న్యాయం కోసం
దర్శించాలందరి"ననె.

పాఠశాల ప్రభుత్వముది
హరిజన టీచర్ను వేయ
ఇతరులు బెదరించి, తిట్టి
"ఇంటికెళ్ళి పొ''మ్మనిరి.

సావర్కరు ముందుకొచ్చి
సర్కారుతొ సంప్రదించె.
ప్రతిఘటించి ఆచార్యుని
పాఠశాల లోనెవుంచె.

మతమార్పిడి ఊచ్చులందు
కథమారిన సోదరులకు
శుద్ధి కార్యక్రమాలతో
సద్బుద్ధిని ప్రసాదించె.

అంటరాని దురాచార
మంతము గావాలంటూ
హరినామ స్మరణతో, హరి
జనులనాలయము కంపెను.

తలపండిన చాదస్తులు
తమముందే తల్లడిలిరి.
దేవుడు మైలాయెనంటు
దండిగ గగ్గోలెత్తిరి.

"వీధి గ్రామ సింహాలతొ
ఆడుకుంటె లేదుతప్పు!
పందులనూ పశుగణాల్ని
పట్టుకుంటె లేదుతప్పు!!

హరిజనుల్ని-గిరిజనుల్ని
అంటుకుంటె తప్పా యది?
ధర్మసూక్ష్మములు దెలియక
తప్పుచేస్తె ఒప్పా యది?

సాటి మానవుడు తాకితె
స్వామి మైల పడతాడా?
వీరినింక వుపేక్షించు
వారే అస్పృశ్యులు''అనె

పందొందొందల ఇరవై
ఐదో సంవత్సరాన'
గణేశోత్సవాలు జరుప
హరిజనులను రప్పించెను.

దళిత మహాసభలు జరిగె
దండిగ "మాళ్వాన్" పురమున
సభాధ్యక్షతను వహించి
సందేశామృతము పంచె,

సావర్కరు క్రాంతదర్శ
నము గాంచిన "రాజభోజు"
దళితజాతి నాయకమణి
దగ్గరాయె, గౌరవించి.

పందొందొందల ఇరవై
తొమ్మిది సంవత్సరాన
దళితజాతి జనులగూడి
దవ్వున గుడి జేరాలనె.

విష్ణునామ స్మరణ చేత
విఠోభాలయమున జేరి,
ప్రార్థన, పూజలు జేస్తూ
పులకించిరి, హర్షించిరి.

అంటరాని వర్గమందు
అంతరంగ కక్షలుండె.
పలునీతులు బోధించగ
పటాపంచలై వీడె.

పందొమ్మిది వందలము
ప్పది ఒకటవ వత్సరము.
భరత జాతి మరువలేని
బృహత్కార్య సంరంభము.

సముచిత భారత సంస్కృతి
సంప్రదాయ సమాదృతము.
ధార్మిక విప్లవ చిహ్నము
దయామయుడి సత్కార్యము.

దళిత ప్రజల మధ్య" పతిత
పావనాలయము" గట్టిరి.
మచ్చలేని హిందువులది
మరో వారణాసి యనిరి.

హిందూ బంధువుల మధ్య
హరిజన పూజారి తోడ
భగవద్గీతామృత రస
పానం, అర్చనలు గూడ.

విశ్వహిందు జనావళి. సు
విశాల స్ఫూర్తి కేంద్రమ్మది,
సావర్కరు కృషి ఫలితం
సఫలీకృత స్వప్నమ్మది.

కుల భేదాలను మరిచిరి
కుత్సితాలు కరిగిపోయె.
సామూహిక భోజనాల
బంతులెన్నొ లేచిపోయె.

సామూహిక జనంముందు
సురుచిర సందేశమిచ్చె.
"హిందుదేశ పౌరులార
ఇకనైనా తెలుసుకోండి.

హిందువులం హిందువులం
మనమంతా బంధువులం.
విడిపోతే పడిపోతాం
విధివంచితులై పోతాం.

మాలలనీ మాదిగలని
మారణ హోమాలెందుకు?
ఉచ్చ నీచ భేదమ్ముల
ఉచ్చులింక మనకెందుకు?

మన మంతా హిందువులం
మనువు నుండి బంధువులం.
వర్ణాంతర వివాహాల
వరుసలు మనకాదర్శం.

మన బంధువులే కొందరు
మనుమార్గం మార్చుకొనిరి.
మతం మార్చుకుని తిరిగిరి
గతులు మార్చుకునిరి గదా!!

వారి మనసు-మన మధ్యన
మనుషులే మొ వేరొకచో.
మేలౌ, భారత ధర్మం
మనవాళ్ళకు జూపినచో.

కడలి ఒడిన ప్రయాణములు
కడుపాతవి, కొత్త కాదు.
జ్ఞాన జ్యోతి వెలుగులకై
ఎటకేగిన తప్పుకాదు

స్వతంత్రించి మనదేశం
గత ప్రాభవ మొంద గలదు.
అఖండ హైందవ ధ్వజమ్ము
అందించును సౌభాగ్యం.

సైన్యములో చేరడానిక
సంకోచము జెందనేల?
మన యువకుల శక్తి యుక్తి
మనకే శ్రీరామరక్ష.

జీవితాలు బుద్బుదాలు
జగన్నాథ నాటకాలు.
పరమాత్ముని చేరువరకు
పరహిత కార్యాలె మేలు.

యుగయుగాల సత్య, ధర్మ
ముట్టిపడెను భాషణలో.
జనగణ హృదయాంతరమున
జవమునింపి దాచేసెను.

జాతీయత యననేమిటి?
జాతియం ఎలాగుండు?
సుమధుర భాషణములలో
సుస్పష్టం చేసినాడు.

"సృష్టికర్త లీలలతో
సృష్టించెను ప్రాణులను.
మేథనిచ్చినాడు ఒకే
వరమది, మానవజాతికి.

మానవత్వముంటేనే
మానవ జన్మము ధన్యం.
భాషలు వేరైతె నేమి?
భావాలకె ప్రాధాన్యం.

మత మంటే విశ్వాసము,
మనోభావ సంపుటమది.
నమ్మకాల కూడలిలో
నరజన్మకు నానుడియది.

మత రక్షణ మంచిదైన
మత మౌఢ్యం హేయమైంది.
మతం పేర కవ్వింపులు
మహమ్మారి నాట్యమ్మది.

జాతిగుండె సవ్వడులను
జాతీయత నినదించును.
మాతృ భూమి నామ మందు
మహిత జాతి పేరుండును.

జర్మనీల నివాసాన్ని
"జర్మని'' యన్నారు గదా.
రష్యన్ ప్రజ జన్మభూమి
"రష్యా" యన్నారు గదా!

బ్రిటన్ జాతి ప్రజల భూమి
''బ్రిటన్" దేశమనిరి గదా!
చైనీయులు తమ దేశం
"చైనా' యన్నారు గదా!

ఫ్రెంచి జాతి మాతృభూమి
"ఫ్రాన్సు'' దేశ మంటున్నాం
అమెరికన్ల జన్మభూమి
''అమెరికా" యనంటున్నాం.

హిందు జాతి పుణ్యభూమి
''హిందూ దేశ'' మంటారు.
''ఇండియా" ఎందుకనాలో
ఇంచుక తర్కించుకోండి.

హిందూ దేశ వాసులంత
ఏదేవుని పూజించిన
హిందూ సంస్కృతి ఇచ్చట
ఇలవేలుపు జనావళికి.

నాదేశపు ప్రజలందరి
నియమాలూ, అలవాట్లూ,
శాక, పాక విధానాలు,
హిందూ ధర్మ బద్ధాలు.

పురాణాల గాధావళి
పుష్కరాల పంబరాలు.
జానపదుల మదికారం
హిందూ హృది శ్రీకారం.

జాతిని రక్షిస్తేనే
జాతీయత రక్షయౌను.
విజాతీయ దాడులన్ని
విసిరికొడితె మేలుయగును.

జాతిని బలహీనుడెపుడు
జాగ్రత్తగ నుంచడంట.
బలహీనుని కవ్వించుట
బలవంతుల కొటపట్టు.

"హిందూ" అను మతము లేదు
హిందూ ధర్మం వున్నది.
పరమాత్ముడు ప్రవచించిన
పరమ ధర్మ క్షేత్రమ్మది.

హిందూ ధర్మ మందరిది
కొందరి పరిమితము గాదు.
హిందూ దేశ వాసులకు
ఇంపైనది, సొంపైనది.

''హిందూదేశ పర్యాయము
ఇంపగు "భారత దేశము''.
భారత ఉప ఖండమనే
భావనయే సువిశాలము.

మనసా, వాచా, కర్మణ
మాతృభూమి నాదని, ఈ
జాతిని ప్రేమించువాడు
జగమెరిగిన హైందవుండు

మతము, భారతీయత్వము
సమానార్థములు గావవి.
హిందుత్వం, జాతీయత
అదే భారతీయత్వం.

బౌద్ధ జైన చార్వాకం
సిక్కు ధర్మ విభావరులు
ఈ సంస్కృతి ఫలరాశులె
హిందూ ధర్మ ఫలాలే.

రకరకాల మతాలిచట
రంగు రంగు పూదోటలు.
భారత పుష్పావనిలో
భాసురమగు సురభిళములు.

దేశమనే దేహమునకు
అవయవములు యెన్నైనా,
తరచి చూడ గుండె వొకటి
దాని పేరు. జాతీయత॥

జాతియంటె ఒకేరకం
జీవ సరళి మానవాళి.
సామూహిక ఇతిహాసం
సంస్కృతి సాహిత్య ఫణితి.

స్వార్థ నీతి భంగపరచి
త్యాగనిరతి రంగరించి
మన జాతికి మేల్జేయుట
మత మౌఢ్యం కానెకాదు.

హిందూ దేశ క్రైస్తవులు
భారతీయ క్రైస్తవులే,
హిందూదేశ ముస్లిములు
భారతీయ ముస్లిములే,

# సాహిత్య సౌగంధ్యం

సమాజాన్ని చుంబించే
సాహిత్యం అమరమైంది
సాహిత్యాంబర వీధిన
సాపర్కారు ధృవతారే

వివిధదేశ చరిత్రలను
వివరముగా పఠియించెను.
సాహితీమ తల్లిసేవ
సఫలీకృత మొనరించెను.

మహారాష్ట్ర సాహిత్యం
మధు మాసంలా పొంగెను.
విరబూచిన గులాబీలు
వీరుని కావ్యానెన్నో.

విద్యార్థిగ నున్నపుడే
విదేశాల్లో చదివేప్పుడు,
రచనలెన్నో చేసినాడు
రసపోషణ చేసినాడు.

"ఆత్మార్పణ వీరు"లనెడు
కరపత్రము ప్రచురించెను.
అమరులైన వీరవరుల
అమరవాణి వినిపించెను.

బ్రిటిష్ ప్రభుత దుష్పాలన
బరిదెగింపు నుటంకించి,
ప్రపంచాన్కి వివరిస్తూ
ప్రజావళికి సమర్పించె.

రచనామృత రసవాహిని
విశ్వభాషలను స్పృశించె.
భాషాంతరీకరణతొ
భాసిల్లెను హృదయాల్లో

ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్
పోర్చుగీసు, రష్యాల్లో
అనువాదము కాగానే
అమ్మకాలు దేశాల్లో.

కలం ముందు కత్తిబలం
చూడ చూడ తీపికట్టు.
దీపికలై రచనలెన్నో
చదువరులను వెన్నుతట్టె.

"ప్రథమ హిందు స్వాతంత్ర్య
సమర"మనే పొత్తమొకటి
వింత పుంత శ్రమలకోర్చి
వెలువరించెను జగజెట్టి.

పెద్రస్సు ముఖం చూడకనే
పొంచి దూకె నిషేధాలు.
విశ్వసాహితీ చరితన
వింత గొలుపు అధ్యాయం.

అచ్చయింది యాగ్రంథము
హాలెండున మొట్టమొదట,
అటుపై ఇంగ్లండ్, జపాను
అమెరికా భారత్‌లో.

సంకేతపు పేర్లతోడ
చలామణిలొ పుంజుకొనెను.
"పిక్ విక్ పేపరు" పేరున
"స్కాటు వర్క్సు" అట్టతోను.

వివిధ వర్ణ షమ్మిళ్రపు
కవరు వేసి కొనినయట్టి
ఆగ్రంథం అపూర్వంగ
అమ్మబడెను మార్కెట్టున.

చదువుతాము రచనలెన్నొ
చారిత్రక విషయాలకు.
సావర్కరు పుస్తకమిది
సృష్టించెను చరిత్రనే.

ముచ్చటిగా ఒక్క ప్రతికి
మూడొందల రూపాయలు.
బ్రిటన్ ప్రజలె పుస్తకాన్ని
బ్లాకు ధరలొ కొని చదివిరి.

ఈ గ్రంథము కానుకగా
ఇచ్చినపుడు పొంగిపోవు
శత్రువులే మనసు మారి
మిత్రులుగా మారినారు.

"పవిత్రవీర గీతిక"యని
పత్రికలే ప్రశంసించె.
దేశభక్త జనావళికి
దివ్య గీతలై శ్రవించె.

సుభాష్‌చంద్రబోసు చదివి
సంతసాన పొంగినాడు.
హిందుఫౌజు స్థాపనకై
ఉత్తేజము పొందినాడు.

ముప్పదెనమిది వర్షములు
మూగ నిషేధాల్ని చించి
అచ్చొత్తుట ఆగలేదు
అమ్మకాలు నిలువలేదు.

"సిక్కుచరిత్ర" మనుగ్రంథము
శీఘ్రంగా రాసినాడు.
"సాధన శోధన వల్లనె
చరిత నిలుచు ఈప్రజ"కనె.

విదేశాల్లొ రాసినాడు
స్వదేశాన్కి పంపినాడు.
కారణమే తెలియలేదు
గమ్యానికి చేరలేదు.

"నరకబాధ లనుభవింప
నరకముతో పనిలే"దని
"అండమాను జైలు" గూర్చి
అమరరచన గావించెను.

మాతృభాష మరాఠీలో
మలచెనెన్నొ అనుభవాలు.
రంగస్థల రచనలాయె
రసహృదులకు రసగుళికలు.

"అమరవుప్ప"మనే రచన
"కమల" కావ్య కంఠమాల.
కలంబలం జగతి కనగ
కవితలాయె సుమమాలలు.

జైలు జీవితములోనే
జబర్దస్తి కాలములో
మహాకావ్య సృష్టిసాగె
మహనీయుని వూహలలో.

గడ్డురోజు లెన్నొచ్చిన
గుండెదిటవు సడలలేదు.
కాలమెంతొ విలువైందని
కావ్యరచన వదలలేదు.

కాగితాలు లేవచ్చట
కలాలేవి కానరావు.
మనసులోనె కల్పనతో
మనిషి పెదవు లాడించెను

గుండెబలం కలమాయెను
గోడలాయె కాయితాలు.
వెలుగులేని చీకటిగది
ఎదపుటలలో కవితాక్షరి.

గుహలాంటిది జైలుగదిలో
గాలివెలితి బ్రతుకాయెను.
ఇంద్రజాల మన్నట్టుగ
ఇంపుగ రచనలు సాగెను

చిన్నచిన్న గులకరాళ్ళ
చిరుముళ్ళను ఏరి, కూర్చి
గోడమీద పంక్తులెన్నొ
గోప్యముగా రాసి చదివె.

మనోవజ్ర సంకల్పము
మహితమైన పట్టుదలన
వేదాలను చదివినట్టు
వల్లెవేసె మనసులోన.

మృతప్రాయపు గోడనిండ
అమృతధారలెన్నొ నిండె.
కవితాభరణాలు నిండ
కరిగిపోయె రాతి గుండె.

కడుచీకటి గదులలోన
కవితయె సిరివెన్నలాయె.
మోడులైన పెదవులపై
మృదుపదముల నృత్యమాయె.

మహాకవుల కోవలోన
మహాద్భుతం కావ్యరచన.
కావ్యరచనతో పాటుగ
కంఠస్థం మదే రోజున.

పద్యాలను రాయగానె
పదేపదే చదువుతాడు.
ఖైదీలతొ చదివేస్తే
కంఠోపాఠాలాయెను.

ఎన్నో విషయాల గూర్చి
ఎన్నెన్నో కావ్యమ్ములు.
కంపునీరు తాగుతూనె
ఇంపుగ కవితాగానము,

ధర్మమార్గ కావ్యమొకటి
"గురుగోవింద్ బలిదానము"
సుజ్ఞానామృత గ్రంథము
"ఏసుక్రీస్తు బలిదానము."

ఉజ్వల కవితాహారము
"పానిపట్టు" చరితమాయె.
దివ్యధార, ధారణతో
దశసహస్ర పంక్తులాయె.

దేశభక్తి సుధాలహరి
జాలువారె రచనలలో.
అలంకార రసపోషణ
అలరించెను కావ్యాల్లో.

అధ్యాయాలైదు రాసె
అసంపూర్ణ కావ్యమాయె.
పండొండొందల ఇరవై
రెండున అచ్చైపోయెను.

"జగన్నాథ రథోత్సవం"
"జైలుగది" "శృంఖల"లతో
"మృత్యుశయ్య" శీర్షికల్తొ
మరి యెన్నొ రచనలాయె.

రామాయణ భారతాల్ని
ప్రామాణిక వేదాలను
వెర్రిగనిందించుటయే
విప్లవమని నమ్మువార్కి.

చెంపపెట్టు కావాలని
ఛాందసాలు వదలాలని
"మహారాష్ట్ర" దను పేరున
మహాగ్రంథ రచనచేసె.

"హిందుత్వ"మ్మను కావ్యము
హిందూ సంఘటన పథము.
సంస్కృతి, సాహిత్య, ధర్మ
సమ్మేళన సుధారసము.

విజయరాఘవాచారిది
"వేదర్షులగ్రంథ"మనెను.
శ్రద్ధానందస్వామి "ధర్మ
శాస్త్ర"మంటు శ్లాఘించెను.

మేధావుల పథగామిగ
మరోముద్ర వేసుకుంది.
దేశభక్త హృదయాలకు
దర్శనకావ్య రాజమది.

మహామహుల మనసుదోచి
మార్గదర్శనము జేసెను.
డాక్టర్ హెగ్డేవార్ యిది
సత్య, ధర్మ గ్రంథమనెను.

# స్వాతంత్ర్య భానూదయం

సావర్కరు తోడునీడ
సాధ్వీమణి భార్యామణి.
వీరమనోగంగ స్నాత
వీరపత్ని యమున వాణి

పతికితోడు నీడగుటయె
పదివేలని భావించెను.
సుమంగళిగ జీవించుటె
సుమనోహర మనిదోచెను.

పందొమ్మిది వంద లిరవ
త్యైదున పత్రిక జననం.
పందొందొందల యిరవై
ఎనిమిది పుత్రిని జననం

పందొందొందల ముప్పై
య్యైదవ సంవత్సరమున
భారత జన చేతనకై
బంతి భోజనము బెట్టెను,

పందొందొందల ముప్పై
యేడో సంవత్సరాన.
ఆంక్షలన్ని తొలగిపోయె
ఆత్మానంద శుభదినాన.

స్వేచ్ఛావాయువులు యెదన
పురివిప్పిన పికములాయె.
దేశ స్వేచ్ఛ సాధనకై
సాగిపోవ సులభ మాయె.

దేశమాత సౌభాగ్యం
ద్విగిణీకృత బలమాయె.
భరతమాత యశోగాన
పల్లవియై సాగిపోయె.

నిర్వహించె హిందూ సభ
కర్ణావతి ప్రాంగణాన
అగ్రాసన మధిష్టించి
అధ్యవసాయము జూపెను.

పందొందొందల నలభై
మూడవ సంవత్సరాన
సావర్కరు షష్టిపూర్తి
సంబరాలు భారతాన.

జేజేలతొ నేతలంత
జయమాలలు వేసినారు.
మరపురాని సేవలంటు
మంగళ హారతు లిచ్చిరి,

పూనా ప్రజ సాదరమున
పిలిచి, గౌరవించె సభన,
అధ్యక్షుడు కేల్కర్జీ
"అజాత శత్రు" వితండనె.

స్వాగతించి, గౌరవించి
సన్మానము జరిపించిరి.
లక్షిరవై వేల రొఖ్ఖ
మందించిరి, జై కొట్టిరి.

ప్రజా ప్రేమ పొంగి పొరలి
ప్రవహించెను పరవశాన.
ఆర్ధ్ర హృదయు, వీరభావ
హర్షితుడై పులకించెను.

"నా భారత ప్రజలముందు
నత శిరస్కుడను సతతము
కృతజ్ఞతా భారమిప్డు
కంపనాలు రేపుతుంది.

ఏ జన్మల పుణ్యమొ! నా
కీ భారతి జన్మనిచ్చె.
పుణ్యభూమి దీవించగ
పులకింతలు పొంగివచ్చె.

అరశతాబ్ది కఠిన శిక్ష
ప్రవాసాల పరీక్షలను
తలచుకొన్న ఈక్షణాన
తన్మయతా తరంగాలు".

దేశము నలుమూల లందు
జరిగింది మహోత్సవం.
వాడ వాడ మోగిపోయె
వీరవరుని సాహసాలు.

నిషేధాల సంకెళ్ళను
నిరసించిన సాహిత్యము
బంధనాలు తెంచుకొని
పరుగులెత్తె ప్రజముందుకు

పలుశతాబ్దములు సాగిన
పటుతర దీక్షా ఫలితము
పందొందొందల నలభై
యేడులోన సిద్ధించెను.

పదిహేనవ ఆగస్టున
ప్రభవించెను స్వాతంత్ర్యం.
స్వేచ్ఛా భారత మంతా
సందడి, శుభ దినోత్సవం.

జన్మల కనుల జలధారలు
జారె స్వాతి ముత్యాలై.
కవుల కవిత పొంగె సువ
ర్ణాక్షరాభి షేకాలై

సావర్కరు హృదయములో
సంతోషామృతము నిండె.
భారత్ విభజించారనె
బాధయె విషబిందువండి.

"రంగుమార్చు రాజకీయ
రంగానికి చేర,,ననెను.
"హిందూ సంఘటనే యిక
ఈ జన్మకు ధ్యేయ" మనెను.

పందొందొందల నలభై
ఎనిమిది సంవత్సరాన.
బాపూజీ హత్య కేసు
లిరికించిరి, బంధించిరి.

కోర్టులోన సావర్కరు
కనిపించెను, వాదించెను.
"గాంధీ నాకు శత్రువా?
గోడ్సే నాకు మిత్రుడా?

దేశ భక్తులెవరైనా
తోటి దేశ భక్తమణిని
హతమార్చుట నమ్ముదురా!
కలలో నూహించెదరా!!

విప్లవించి వెలిగినాను
విదేశీలు వెళ్ళాలని.
జాతీయ విప్లవ దారి
జాతీయుల రక్షణకని.

దేశమాత స్వేచ్ఛయె మా
ధ్యేయముగా పోరినాము.
దారులు వేరైనగాని
గమ్యములో కలిసినాము."

నలభై తొమిదిలోనే
విడుదలాయె మరోసారి
యాభైలో బందీగా
మారినాడు మరోసారి.

స్వేచ్ఛా భారత మందున
స్వేచ్ఛ కరువు వుండదనిరి.
లియాకతలీ కేసు కొరకు
బంధించిరి వదిలేసిరి.

బందీగా మారిపోయి
బాధల నెదురించినాడు.
తనునమ్మిన ధర్మంకై
తలవంచక నిలిచినాడు

పందొమ్మిది వందల యా
భయ్యైదున, రజితోత్సవ
పండుగ కన్నుల పండుగ
పతిత పావనాలయమున.

రత్నగిరిన ధర్మరత్న
రాశులెన్నో భాసించెను
సావర్కరు కృషి ఫలితం
సఫలమాయె వేడుకలై.



# మహాభి నిష్క్రమణం

భారత జనమానస చో
రునిమహితమ్మౌ మనసు
యశో కాంత ఇల్లాలగు
యమునాబాయికె తెలుసు.

వేడివేడి పదార్థాలు
వెగటాయెను. అలవాటై.
చాక్లెట్లను చప్పరిస్తు
చెవులూరగ మాటలాడు.

తినగ తినగ వేముగూడ
తియ్యనౌను నిజమేమో!
చల్లటివే తినాలంటు
చెరసాలలు నేర్పెనేమొ!

కోపానికి తాపానికి
కడుదూరం నిలిచినాడు.
సంయమనం స్వాతంత్ర్యం
తన సొత్తుగ వెలిగినాడు.

పందొమ్మిది వందల యా
భయ్యేడున బొంబాయిన
భరతవీర సన్మానం
భారతాంబ సన్మానం.

వీరుని శుభ జన్మదినం
వజ్రోత్సవ వేడుకలన
మేయర్ యధ్యక్షతన
మహామహుల సమక్షమున

జనవాహిని స్పందించగ
జవమునింపె భాషణలో.
"పౌరులార! ఋణభారము
పెరిగిపోయె నామదిలో.

యువకులార! ముందు నిల్చి
ఉత్సాహము జూపరండి.
భారతీయ ధర్మాలే
యువభారతి వెలుగులండి.

యుగయుగాల దీ సంస్కృతి
జగానికే వెలుగునిచ్చె.
తరతరాల వారసత్వ
ధర్మమె శుభ ప్రదములిచ్చె.

యువశక్తే నవశక్తై
ఉప్పొంగుతు కదలాలోయ్.
దురాక్రమణ కీ దేశము
దుర్భేధ్యం కావాలోయ్.

ప్రతి మనిషీ కండ పెంచి
గుండెబలం చూపాలోయ్.
తిండిపోతు తిమ్మన్నల
తరిమి కొడుతు పోవాలోయ్.

పూనా బుధజన గణములు
"పునీతు"డని శ్లాఘించిరి.
సావర్కరు పేరిటనొక
సభాగృహం నిర్మించిరి.

హృదయోల్లాసము పొంగగ
జన సందోహము నిండగ
ప్రీతి గొలుపు మాటలతో
అంకితమిచ్చిరి జాతికి.

అధ్యక్షుడు సర్. సీ. పీ.
అయ్యర్జీ రామస్వామి,
అభిమానము వేసెను, అభి
నందన మందార మాల

పూనా యూనివర్సిటీ
ప్రేమ మీర ప్రోత్సహించె
"డాక్టరాఫ్ లెటర్స్"నెడు
బిరుదు నిచ్చె గౌరవించి.

పందొండొందల అరవై
పాప్రధాన్యము సంతరించె.
అండమాన్లొ ఉండియుంటె
గండం కడతేరుచుండె

మృత్యువతిని ముందు నిలిచి
అమృతధార వర్షించెను.
ఆ వత్సర జన్మదినము
అభిమానుల కుత్సాహము.

"మృత్యుంజయ మహోత్సవం"
ముదిపాలతొ జరిపించిరి.
"మృత్యుంజయ" బిరుదముతో
మహనీయుని పొంగించిరి.

అండమానుద్వీపమందు
ఆదమరచి జరిపించిరి.
సావర్కరు పటముబెట్టి
సుమ మాలలు యర్పించిరి.

మహారాష్ట్రి వాడ వాడ
మృత్యుంజయ మహోత్సవం.
కళ్ళు జిగేల్ మనిపించెను
కలకత్తా శుభోత్సవం.

పంటొంటొందల అరవై
రెండో సంవత్సరాన
చైనా చేతిలో భారత్
చేదు అనుభవం పొందెను.

వీర భారతాంబ చూపు
విహ్వలమై గోచరించె.
వీరుడు తన జీవితాన
విలపించెను గంటసేపు.

"భరతమాత ఆదర్శము
అందల మెక్కాలంటే
భూమి మీద తోసేసెను
నౌసటిరాత దిగమంటూ.

వీరభూమి వెనుకంజలు
వింతగొలిపె విశ్వమందు.
ఇకనైనా మనదేశము
బలపడాలి ముందు ముందు."

అలసట రుచి జూడలేదు,
అతని కలం నడిచె వడిగ
రచనా వ్యాసంగ సమర
రంగ భూమిలో వేడిగ

సావర్కరు మనోబలం
సృష్టించెను చివరిసుమము.
విశ్వసాహితీ వనాన
విరబూసిన మందారము.

"భారతీయ చరిత్రలో
స్వర్ణ పత్రములు" పొత్తము.
దేశభక్తు లెందరికో
పారాయణమది నిత్యము.

ఎనభయ్యో జన్మదినము
ఉత్సవాలు మాన్పించెను.
మరుదినాన ఎడమకాలు
కీలుపట్టు విడిపోయెను.

ఆస్పత్రిలో జేర్పించగ
శస్త్ర చికిత్సలు జరిగెను.
తొడలో విరిగిన ఎముకను
తొలగించిరి అక్కడనే,

ముల్లు నక్క మీద తాటి
ముంజగుత్తి పడినట్టుగ
సతి మరణం వెక్కిరించె
విధి యపుడే పగబట్టగ.

జీవన పోరాట స్ఫూర్తి
జవమెరిగిన జవానుకై
జీవన సంధ్యా సమయం
ఒంటరిగా అయోమయం.

పండొండొందల అరవై
నాల్గో సంవత్సరమున
గౌరవించె ప్రభుత్వమే,
గౌరవ వేతన మిచ్చెను.

ఆగష్టు రవయ్యేదున
ఆరోగ్యము క్షీణించెను.
"మందులతో జీవితాన్ని
పెంచుకోగనీయ" ననెను.

అరవయారు ఫిబ్రవరిన
మూడవ తారీకు నుండి
నిరాహార వ్రతదీక్షకు
నిర్ణయించె మహాఘనుడు.

మహామునుల పథమందున
పట్టుబట్టి పయనించెను.
ఆత్మసమర్పణ ద్వారా
ఆహ్వానించె మృత్యువును,

కూతురు, అల్లుడు వచ్చిరి,
కన్నీళ్ళతో కంపించిరి.
దైవసన్నిధిని జేరగ
దారివెదక తన వూపిరి.

బిడ్డను దగ్గర బిలిచెను
బుజ్జగిస్తు వూరడించె.
"తల్లీ! ఏడవకమ్మా!
తమాయించు కోవమ్మా!

జీవికి మరణము తప్పదు
జగమెరిగిన సత్యమమ్మ
నీ తండ్రిక లేడటంచు
తపన జెంద బోకమ్మా!

పరమాత్ముని పిలుపు కొరకు
పరితపించు చుంటినమ్మ.
జీవాత్మ పరమాత్మను.
దరిజేరుట తథ్యమమ్మ.

తల్లి దండ్రి లేరంటూ
తామసపడ బోకమ్మా.
భగవంతుడె సర్వమంటు
భారము వేయాలమ్మా."

ఇచ్ఛికముగ దీక్ష సాగి
ఇరవై రెండో రోజులాయె
చైతన్యము చిందులాడి
స్పృహ నెప్పుడు వీడదాయె.

పందొమ్మిది ఎందల అర
వయ్యారున ఫిబ్రవరిన
ఉదయం పదకొండాయెను
ఇరవయ్యారవ తేదిన.

ఉదయభాను కిరణాల్లో
విమల భావనలు హెచ్చె.
వీరస్వర్గ పురము నుండి
వీరుని కాహ్వాన మొచ్చె.

భారతేతి హాసాంబర
భవ్య చరిత నక్షత్రము
వసుంధరను తాకగానె
వెల్లువలై సాగె జనము

ఆ పార్థివ శరీరాన్కి
అంత్యక్రియలు మరురోజున.
విశ్వ శిఖా మణులందరు
వినయాంజలు లర్పించిరి.

"అమర చరిత సావర్కరు
అమరర్హే" నినాదాలు.
రమ్య చరిత భారతాంబ
రక్తాశ్రులతో చూపులు.

పారతంత్ర్య తిమిరములను
చెండాడిన భానుడతడు
ఇపుడైనా, అపుడైనా
ఇలవేలుపు యువతకెపుడు.

ఆనాటికి ఈనాటికి
ఎన్నియుగాలకు గానీ.
సావర్కరు దేశభక్తి
సహస్రాబ్ది స్ఫూర్తి మూర్తి

